# కృష్ణశాస్త్రి

## తొలి పద్య కృతుల
## సంపుటి

# కృష్ణపక్షము



ఓరియంట్ లాంగ్మన్

ఓరియంట్ లాంగ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర)

ఇతర కార్యాలయాలు
ముంబాయి కలకత్తా చెన్నాయి కొత్త ఢిల్లీ
జైపూర్ బెంగుళూరు హైదరాబాద్ పాట్నా
గౌహతి లక్నో భువనేశ్వర్ ఎర్నాకులం



ISBN 81 250 1146 3



తొలి ముద్రణ 1992
మలి ముద్రణ 1997

ప్రచురణ
ఓరియంట్ లాంగ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

ముద్రణ
వినాయకసాయి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ హైదరాబాద్ 500 004

# అనుక్రమణిక

# విన్నపము

భావకవితా ప్రవక్తగా భాసిల్లినవారు కృష్ణశాస్త్రి.

భావకవితా రీతికి ఒజ్జబంతిగా ప్రసిద్ధి గన్నది వారి తొలి పద్యసంపుట త్రయి - కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి.

ఆత్మపరమైన ఈ పద్యకృతులు మూడింటికీ పరస్పర సంబంధం ఉంది. ఆనుపూర్వి ఉంది. ఇతివృత్తం ఒకటే - కృష్ణశాస్త్రి ప్రణయకవితా ప్రస్థానం. మూడూ కలిపి చదువుకోతగ్గవి.

కృష్ణపక్షం సంపుటాన్ని మొదట 1925 లో, సాహితీ సమితి తరపున, తమ సింహావలోకనంతో, ప్రచురించినవారు, సభాపతి తల్లావఝల శివశంకరశాస్త్రి (శివశంకరస్వామి). తరువాత ప్రవాసము - ఊర్వశి అనే సంపుటిని 1929 లో అచ్చువేసిన వారు, 'జ్వాల' పత్రికను నడుపుతున్న ముద్దుకృష్ణ.

ఆ తరువాత కృష్ణపక్షము - ప్రవాసము - ఊర్వశి కలిపి ఒకే సంపుటిగా పలు ముద్రణలు పొందాయి.

1975 లో స్వర్ణోత్సవ సమర్పణగా ఈ కావ్యత్రయి తిరిగి ప్రచురితమైంది.

ప్రకాశకులు

# కవి మాటలలో....

"ఒక ఆంధ్రకవి కృష్ణపక్షంలో ప్రవాసియై తిరిగి తిరిగీ, కంట బడిన ప్రతి లావణ్యాన్నీ కదిపి కదిపీ, పక్కన మోగిన ప్రతి హృదయాన్నీ పలకరించి పలకరించీ, లోకంలో తనకు నచ్చిన సౌందర్యం లేదనీ, తన్ను ప్రేమించి తాను ప్రేమించే ప్రేయసి లేదనీ కుంగిపోయి కుంగిపోయీ, ముచ్చిచ్చులో వేగి వేగీ, 'హా సుగాయులు లేవు. హా సుఖమ్ములు లేవు' అన్న నరకంలోకి వచ్చాక, తపస్సు పూర్తి అయాక, క్రాంతదర్శుడై కాదే ప్రేయసిని సృష్టించుకున్నాడట! ఎలాగ? తన మనస్సును ఎన్నడో ఎన్నడో దోచిన ప్రతి సౌందర్య ఖండాన్నీ, తన హృదయాన్ని ఎన్నడో ఎన్నడో పలకరించిన ప్రతి ప్రేమ శకలాన్నీ, ఎక్కెడెక్కడికో పరుగెత్తుకుని వెళ్ళి, ఏరి ఏరి తెచ్చుకుని, అన్నిటినీ కలిపి కలిపీ ఆమెను నిర్మించుకున్నా డట! అంటే ఏమిటి? కవిది అరని చిచ్చు! తీరని తృష్ణ!.... కృష్ణపక్షమూ, ప్రవాసమూ అయాక - ఊర్వశి, కార్తికేవి!"

('ఊర్వశి' ప్రసంగవ్యాసం నుంచి: కృష్ణశాస్త్రి వ్యాసావళి - 2, పుట 59)

# కృష్ణపక్ష సింహావలోకనము

1

'కృష్ణపక్షము'లోని ఖండికలలో గాని, గీతికలలో గాని దేని కిని కృష్ణపక్ష మను పేరు లేదు. కవి కృష్ణశాస్త్రి. కవిత్వము విశేష భాగము కరుణారసాత్మకము. నిరానందసూచక మగు కృష్ణపక్ష మును కవి స్వీకరించి, సాంకేతికముగా కావ్యసందోహమునకు ఈ నామ ముంచినాడు. ఈ సందోహ మాంధ్రసారస్వతములో అపూర్వము, అత్యంత విశిష్టము.

కృష్ణశాస్త్రిగారి బాబయ్య, నాన్నగారు పిఠాపుర రాస్థాన కవులు. ఈ విద్వత్కవులు గంగాధర రామారావువారి ఆస్థానములోను, సూర్యారాయ మహీపతివారి ఆస్థానములోను విశేషాదరము పొం దెడి వారు. వారిబిడ్డ డగుటచేతనే ఈ కవికి ప్రభుభక్తి కలదు. అందు వల్లనే 'కృష్ణపక్షము' పిఠాపుర మహారాజున కంకిత మగుట సంభవించినది.

2

ఈ కవి భావతరంగిణి చతుర్విధముల ప్రవహించుచుండును. ఆ వేణికలు నాలుగింటికిని పరస్పర సంబంధము కూడ గోచ రించును.

అందు మొదటిది స్వతంత్రబుద్ధి. ఆధునిక లోకములో సర్వతో ముఖముగా విజృంభించుచున్న స్వాతంత్ర్యభావ తరంగము ఈ కవి హృదయమున ఆఘాతము చేసి, కవితలో బహువిధముల వ్యక్త మయినవి. స్వేచ్ఛాగానము అను కావ్యశీర్షికయే దీనికి నిదర్శ

నము. ఈయన స్వేచ్ఛ నిరర్గళమై, నిరపాయమై లోకహాని చేయు స్వేచ్ఛా భావము కాదు. ఈ కవి యిట్లన్నారు:

> క్రౌర్య కౌటిల్య కల్పిత కఠినదాస్య
> శృంఖలములు తమంతనె చెదరిపోవ
> గగనతలము మార్మ్రోగగ కంఠ మెత్తి
> జగము వింత స్వేచ్ఛాగానఝరుల వింతు.

ఈ స్వేచ్ఛాగానము 'తిమిరలతను తారకా కుసుమముల దాల్ప' జేయునది. 'కర్కశ శిలను నవజీవకళల దేర' జేయునది. 'చిత్త మానందమయ మరీచికల' సోలించునది.

ఈ కవి చిత్రకల్పనలకు పలుమారు ప్రయోగించు నుప మానముల స్వభావమువలననే స్వేచ్ఛాప్రవృత్తి విశద మగుచుండును. ఝరులు, విహంగములు, మేఘములు, విద్యుల్లతలు, ఝంఝాప్రభం జనములు, తారకలు, మిణుగురులు, - ఇట్టివి మాటిమాటికిని రచనలో కానిపించుచుండును. ఈ కవి 'స్వేచ్ఛాకుమారుడు'; 'గగనపథ విహార విహంగమపతి'; 'మోహన వినీల జలధరమూర్తి'; 'ప్రళయ ఝంఝా ప్రభంజనస్వామి'; ఆకులో ఆకు, పూవులో పూవు'. 'గలగలని వీచు విరుగాలిలో కెరటము', 'జలజలని పారు సెల పాటలో తేట', 'పగడాల చిగురాకు తెరచాటు తేటి'యు నయి, ఆకలి దప్పులు, చింతలు వంతలు లేక అడవిలో దాగిపోయి ఏక తమ తిరుగాడుట యీ కవి యభీప్సితము.

ఈ స్వేచ్ఛా ప్రియత్వము బహువిషయముల గానవచ్చు చున్నది. సంప్రదాయానుగతములైన ఛందస్సులనే గాక నూతన చ్ఛందములను గూడ గ్రహించి వానిలో భావములను బాగుగా పలికించి రస మొప్పించుట; పాదభాగములో ఖండిక ప్రారంభిం చుట; పాదాంతము కాకుండనే కావ్యము ముగించుట; నూతన

 [illegible]పెనుదీయకుండుట ; కొన్ని ఖండికలకు నామ ముంచకుండుట - ఇత్యాది విశేషములు సహృదయులకు నవ్యకళ లాపాదించు గుణములుగా గోచరించును.

3

బహు స్వేచ్ఛాభిమానము సుఖప్రదము కానేరదు. చిత్ర విచిత్రగతులు గల యీ లోకములో స్వేచ్ఛారతికి సామాన్యముగా దుఃఖమే ఫలితము. ఈ కవికి గూడ అదియే ప్రాప్త మయ్యెను. దుఃఖమే ఈయన భావతరంగిణిలో ద్వితీయ వేణిక. దుఃఖమును వర్ణించు ఘట్టములం దీ కవి అసామాన్యుడు. దుఃఖము లోతు గ్రహించినవాడు. దుఃఖమే ఈయనకు ప్రియతమ మని తోచును. 'అమలమోహన సంగీత మందు హృదయదళన దారుణ రోదన ధ్వను' లీ కవికి వినబడుచుండును.

'హృదయపాశము తెగియె. నా హృదయధనము
తొలగిపోయెను. జీవితఫలము ప్రుక్కి
నేల బడె, నింక జీవింప నేల సఖుడ ?'

'హృదయశోణితధార పెరుగు జీవిత వల్లి
మొద లంటి కూల్చినారే – భయదాగ్ని
కీలలను వ్రేల్చినారె !'

ఈ విధముగా విలపించు మానసమునకు దుఃఖముతో నిరంతర సాహచర్యము వల్ల దుఃఖమే వింతభోగముగా పరిణమించి నది. అది నిరుప మానంద సంపద యయినది. ఆత్మశక్తి నుజ్జీవింపజేసినది. అంతట ఈయనకు లోకము తృణప్రాయముగా గాన బడినది.

'ఎవ్వ రవి యుంటురో నన్ను? - ఏ వసంత
శోక భీకర తిమిరలో శైకపతిని !....

నాకు విశ్వాస ఘాతవ్యంజాలు కలవు
నాకు కన్నీటి నదుల దొంతరలు కలవు....'

'నాకు మనసారగా నేడ్వనీరు నన్ను —'

అని దుఃఖములోని సౌఖ్యము నెరిగిన కవి నిరాఘాటముగా ఆక్రోశించినాడు.

4

ధీరులు దుఃఖాభిభూతులు కాక దుఃఖములోనే సుఖ సారమును గ్రహింప జూతురు. కేవలము దుఃఖముల నుండు తీరసాహచర్యము చేతనే అట్టి యత్నము సాధ్యము కాదు. ఒకవేళ అట్టి ప్రయత్నము జరిగినను ప్రీతి లేకుండ సఫలము కానేరదు. దుఃఖము లోతు గ్రహించిన యీ కవి హృదయములో ప్రీతి అంకు రించి దుఃఖోపశాంతి చేసినది. అట్టి ప్రేమాంకుర వర్ణనమే 'కృష్ణ పక్షము'లో తృతీయవేళికగా రూపొందిన భావతరంగిణి.

ప్రేమాంకుర మైనతోడనే ప్రకృతియందలి నానావిధ పరి ణామములు, వలపువలని విలాసచేష్టలుగా పొడగట్టును.

'అలరు వడంతు బిల్లరు హిమాంబువులన్
వనమల్లికా నతిన్
జలకము లార్చినారు. వనజాత
పరాగ మలంది వారు, మేల్
జిలుగు హొరంగు పొందళుకు
చీరల గట్టిరి పెండ్లి కంటు: కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి దాగినాడవో!

కాని క్రమక్రమముగా ప్రేమ స్వచ్ఛ మగును. అప్పుడు ప్రయోజనము ప్రధానము కాక స్వచ్ఛంద మగును.

చెప్పు ప్రశ్నంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?'

ప్రేమలోని నిరతిశయానందము గ్రహించినవిమ్మట 'హేమ మణిరత్నగణ' మవసరము కాదు. ప్రేమయే దివ్యభాగ్యముగా దోచును.

ప్రేమ దుఃఖమున కుపశాంతి కలిగించునదే యయినను కేవల మీ ప్రపంచమునకు సంబంధించిన దగునంతవరకు నదియెంతయు నూతనమైన అశాంతిని కొనిరాకపోదు. ఈ యశాంతి బహువిధములు. అందు సాధారణమైనది వియోగజన్యము. అట్టి సందర్భమున—

'ఈ విరహసంతాప మీ ప్రవాస క్లేశ
మే పగిది సహియింతు నెటుల జీవింతున్?'

అని హృదయము విలపించుచున్నది. ఒక్కొక్కప్పుడు ప్రేమాతిశయము వలన భయాతిశయము కలుగుచుండును.

'నీ కనుదెప్ప కావల నొక నిముసమైన కదలనీ
ప్రళయకాలాంత భయద సాగరాశి
వలె విశ్వ మెల్ల ముంచెత్తు సుమ్ము'

అనిపించును—

ప్రేమజన్యమైన యశాంతి ప్రేమ విఫల మయిన ఘట్టములు వర్తించునప్పుడే దుర్భరముగా నుండును. భార్య పరలోకగత యయిన తర్వాత—

'నా విరులతోట పెంచికొన్నాను తొల్త
ననవపు గులాబి మొక్క నా ప్రణయజీవ
నమ్ము వర్షమ్ముగా నవయమ్ము కురిపి.
..... అట్టి దిగియు

తొల్త ప్రభాతార్క కిరణమ్ము : ఈర్ష్య వ్రాలి
నా గులాబి వాలి కూలి నమ్మె పిడె'.

ఇట్లు 'కృష్ణపక్షము'లో కవిత్వము ఆత్మాశ్రయమై హృదయంగమ మయినది.

5

స్వతంత్రబుద్ధితో లోకములో సంచరించి దుఃఖముల పాలై ప్రేమవలనను సంపూర్ణశాంతి పొందలేని మనుష్యులకు ఒక్కటే శరణము. అది ఈశ్వరారాధన. దుఃఖితాత్ములు ఆత్మనివేదనము చేసికాని భక్తిపరాయణులయి భగవానుని యనుగ్రహముచే పవిత్రు లగుదురు. అట్టి భావములు ఈ కావ్యసందోహములో అచ్చ టచ్చట పొడ కట్టుచున్నవి. కవి భావతరంగిణిలోని చతుర్థవేణిక యిదియే.

ఒక్కొక్క భక్తు డొక్కొక్క విధముగా ఈశ్వర సాన్నిధ్యము నకు యత్నించును. అందులో ఆత్మగర్హణవిధానము సాధారణము. 'పాపోహం పాపకర్మాహం' అనిపించుట సహజము. అట్టి యెడనే ఉద్బోధనరూపముగా -

'కరియుమురా కన్నీటివి!
మరిమరి విలపింపుమురా!
నరము గూర్చి నరమేకద
కాల్చుమురా పాపి!'

[illegible] సంభవించును -

భగవానుని పాద సన్నిధానమున చేయు ప్రలాపములుగాని, ఆత్మగర్హణముకాని యెన్నడును వ్యర్థము కావు. మొట్టమొదట ఈశ్వరుని ధ్యానించుట యెట్లో యని శంక పొడమును. క్రమముగా భగవానుని 'వింతచేతలు' విశ్రాంతి కలిగించును. సర్వాత్మకునకు కానుకగా నేమి యర్పింపదగునో యను సంభ్రమము జని యించును. పతితపావను డగు పరమేశ్వరుని పాదసంపర్కముచే సమస్తమాలిన్యము క్షాళిత మగునను ప్రత్యయము తుదకు ప్రభవించును. అప్పుడు -

'కలుష దుర్దాంత పంక సంకలిత కుహర
ముల జనించు నదీ యాత్రి మలినధార
స్వామి, భవదీయ పాద దేశమున జారి
పరమపావన జాహ్నవీ ప్రతిభ గాంచు!'

అనెడి ధైర్య మంకురించును.

ఈ విధముగా సమస్తమును ఈశ్వరార్పణము చేయునపుడే అవ్యయానంద మావిర్భవించును. అది సమగ్రముగా సంభవించి నప్పుడు కృష్ణకవి హృదయములోని కృష్ణపక్షము శుక్లపక్షముగా పరిణమించి లోకముపై నూతనచంద్రికలను ప్రసారింపగలదు.

—శివశంకరశాస్త్రి

శ్రీ శ్రీ శ్రీ మహారాజా
రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు వారికి

తరుణ శృంగార మధుర మాధవుడ వీవు
కలికిపాటల కోయిలకొలము, మాది ;
తావకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారము కురియించి చివురులెత్త
పాడుకొన్నారు మా కులస్వాము లెల్ల
స్వచ్ఛకీర్తి! మనోజ్ఞవసంత మూర్తి!
పికకుమారకు నన్ను పాడుకొన నిమ్ము,
మాలగా తొలిపాటల పూలతోడ
హృదయమే కూర్చి నీకొర కెదురుచూతు!

## ఆకులో ఆకునై ...

ఆకులో ఆకునై పూవులో పూవునై
కొమ్మలో కొమ్మనై నునులేత రెమ్మనై
ఈ యడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

గల గలని వీచు చిరుగాలిలో కెరటమై
జల జలని పారు సెలపాటలో తేటనై
ఈ యడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

పగడాల చిగురాకు తెరచాటు తేటినై
పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గునై
ఈ యడవి దాగిపోనా
ఎట్లైన
నిచటనే యాగిపోనా ?

పరు వెక్కి యల నీలగిరి నెక్కి మెలమెల్ల
వడ లెక్కి జలదంపు నీలంపు నిగ్గునై
ఈ యడవి దాగిపోనా
ఎట్టైన
నివటనే యాగిపోనా ?

ఆకలా దాహమా వింతలా వంతలా
ఈ కరణి వెర్రినై యేకతమ తిరుగాడ
ఈ యడవి దాగిపోనా
ఎట్టైన
నివటనే యాగిపోనా ?

# స్వేచ్ఛాగానము — 1

తిమిరలత తారకా కుసుమముల దాల్చ
కర్కశ శిలయు నవజీవ కళల దేర
ప్రోదు మోక చివురు లెత్తి మురువు సూప
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనె చెదరి పోవ
గగనతలము మార్మ్రోగగ కంఠ మెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

చిత్త మానందమయ మరీచికల పోల
హృదయ మానంద భంగమాలికల దేల
కనుల వానంద జని తాశ్రుకణము లూర
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

యుగయుగంబుల నీశ్వరయోధు లగుచు
స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించువారి
అమల జీవిత ఫలము ధన్యతను గాంచ
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు.

భయము గలిగించు కష్టాతపంబు మరవి
కరము కలగించు వంత చీకట్లు మరవి
విశ్వమే పరవశ మయి వెంట బాడ
జగమునిండ స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

# స్వేచ్ఛాగానము — 2

నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు ?
నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు ?
కలవిహంగమ పక్షముల దేలియాడి
తారకా మణులలో తారనై మెరసి
మాయ మయ్యెదను నా మధురగానమున !
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు ?

మొయిలు దోనెలలోన పయనం బొనర్చి
మిన్నెల్ల విహరించి మెరపునై మెరసి
పాడుమ విన్కునై పడిపోదు నిలకు
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు ?

తెలిమబ్బు తెరచాటు చెలి చందమామ
జతగూడి దోబూచి సరసాల నాడి
దిగిరాను దిగిరాను దివినుండి భువికి
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు ?

శీకరంబులతోడ విరుమీలతోడ
నవమౌక్తికములతో నాట్యమ్ము లాడి

జలధి గర్భమ్ము లోపల మునిగిపోదు
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు?

పరువెత్తి పరువెత్తి పవనునితోడ
తరుశాఖ దూరి పత్రములను జేరి
ప్రణయ రహస్యాలు పల్కుచు నుందు ;
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు?

అలరుపడంతి జక్కిలిగింత పెట్టి
విరిచేడె పులకింప సరసను బాడి
మరియొక్క వనతోడ మంతనం బాడి
వేరొక్క సుమకాంత క్రీడ బో గొట్టి
క్రొందేనె సోనల గ్రోలి సోలుటకు
పూవు పూవునకును పోవుచునుందు ;
నవ్విపోదురు గాక నా కేటి సిగ్గు?

పక్షి నయ్యెద చిన్ని ఋక్ష మయ్యెదను
మధుప మయ్యెద చందమామ నయ్యెదను
మేఘ మయ్యెద వింత మెరపు నయ్యెదను
అలరు నయ్యెద చిగురాకు నయ్యెదను
పాట నయ్యెద కొండవాగు నయ్యెదను
పవన మయ్యెద వార్ధిభంగ మయ్యెదను

'ఏలొకో యెప్పుడో యెటులనో గాని
మాయ మయ్యెద నేను మారిపోయెదను.
నవ్వి పోదురు గాక నా కేటి సిగ్గు?
నా యిచ్ఛయే గాక నా కేటి వెరపు?

# నేను

జిలుగు వసనాల మణిమయోజ్జ్వల మనోజ్ఞ
కాంచ వాంఛిత భూషణగణము పూని
రాజవీథుల రతనాల రథము నెక్కి
వెడలు నిర్జీవ పాషాణ విగ్రహంబ!
చిమ్మ చీకటి పొగల నిశీథ మందు,
క్షుద్ర మందిరాంతర జీర్ణ కుడ్యతలము
లందు కన్నులు మూసి, యానందవశత,
యోగవిజ్ఞాన మత్సిన యోజ, నొడలు
మరచి కులుకు దివాంధమా! మెరుగు లొలుకు
చలువరాతి మేడల చెరసాల లందు,
తళుకు బంగారు సంకెళ్ళ దాల్చి, లోక
పాలకుని బోలె మురియు నో బానిసీడ!
ఓ కుటిల పన్నగము! చెవి యొగ్గి వినుడు!
ఏను స్వేచ్ఛా కుమారుడ నేను గగన
పథ విహార విహంగమ పతిని నేను
మోహన విసీల జలధరమూర్తి నేను
ప్రళయ **ఝంఝా** ప్రభంజన స్వామి నేను!

## నా జీవితము

వింతగా దోచు నాదు జీవితము నాకె!
జిలుగు వెన్నెలతో చిమ్మ చీకటులతో ;
అమల మోహన సంగీత మందు హృదయ
దళన దారుణ రోదనధ్వనులు విందు ;
వక్రగతి బోదు చక్కని పథము నందె.
రాజపథమునకై కుమార్గమున జొతు ;
గరళమే తిందు కడుపార వెరిగి యెరిగి ;
అవల ద్రోతు చేతులార నమృతరసము ;
విస నమృతమట్లు లమృతంబు విసమురీతి
చిత్రవిచిత్రగతుల మార్చు జీవితంబు !

# వె(రిపాట

నందెకెంపులు లోక మెల్లెడ
విందులాడగ హేలము గట్టున
నందెమబ్బుల వింత లేవో
వెదకి కొనుచుంటిన్.

జిలుగు పవడపు మబ్బుతెరలో
తళుకు మని యొక చిన్ని బాలుడు
వలుకు దేనెల నవ్వు తావుల
విలుకు వి ట్లనియెన్:

"అన్న, పిల్లన గ్రోవి దీసుక
చిన్ని మేకను గూర్చి పాడుము
పన్నె పన్నెల నంజి మబ్బులె
ఆగి కూడా పాడగన్."

మెల్ల మెల్లన గాలికెరటాల్
వల్లగా నాట్యాలు సేయగ
నల్ల నల్లన చిన్ని పిల్లన
గ్రోవి నేదో యూదితిన్.

ఆగి వినె విరుగాలి కెరటాల్
ఆగి వినె పవడంపు మబ్బులు
ఆగ కుండగ నేదొ పాడితి
వెదురు పిల్లన గ్రోవితో.

వింతపాట న దేదొ పాడగ
నింత యేడ్పును నింత నవ్వును
నెంతొ సంతోషంబుతో బా
లుండు వినుచుండెన్.

మరచి విశ్వము మరచి మేనే
మరచి సర్వము నన్ను నేనే
మరచి కన్నులు మూసికొని నే
పాడుకొనుచుంటిన్.

పాడ మన్నది విన్న బాలుడు
పాడ విన్నది గాలి మబ్బులు
పాడినది యొక మేకపై - ఆ
వెర్రిపాటకు దెవ్వడో !

(శ్రీకోదిల దివాక)

# తేటివలపు

మలయ సమీర ణోర్మికల
    మాలికలం బ్రణయార్ద్ర గీతికల్
మలయుచు నాట్య మాడవు,
    సుమ ప్రమదామణి పుల్కరింప, నో
యళివర, తేనె లానవు, వనాంతర
    మంతయు విన్నవోయె; కో
మల జలజాత పత్రముల మాటున
    నేటికి డాగినాడవో!

అలరు పడంతు లెల్లరు హిమాంబువులన్
    నవ మల్లికా సతిన్
జలకము లార్చినారు, వనజాత
    పరాగ మలందినారు, మేల్
జిలుగు పొరంగు పొందళుకు
    చీరల గట్టిరి పెండ్లి కంచు; కో
మల జలజాత పత్రముల మాటున
    నేటికి డాగినాడవో!

అలరుచు మల్లికా పరిణయం బని
వచ్చిరి పూవుబోండ్లు, కో
యిల నవరించె గొంతు, తమ
యేలికకై విరిదేనెపానకం
బిశతలి గూర్చె, పుష్పోదుల
నత్తరులం బవనుండు వేర్చె: కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాడవో!

వలపు హరించినాడ వట,
స్వాదు మరందము గ్రోలి తంట, మై
పులకలు పుట్టగా మధురమోహన
గానము జేసి తంట, మా
లలన యమాయికాత్మ భ్రమరా!
తగునా వగ వాడ జేయ: కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి డాగినాడవో!

వలపులు గ్రుమ్మరింపదు, నవ
ప్రణయోదయ హాసచంద్రికల్

విలుకదు, తోడి చిన్ని విరివేడెలతో
జత గూడి నాట్యముల్
సలుపదు, మంచుముత్యములు, షట్పద!
తాల్పదు, మల్లికాంబ; కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి దాగినాడవో!
జలజల రాల్చు దుర్భరవిషాదమునం
దుహినాశ్రు బిందువుల్,
వెలవెల పోవు మారుతము
వీచిన పాదపపత్ర సంతతిన్,
తలిరుల చిన్నవోయి యెడదో
త ప్పొనరింపవిపరీతి నక్కు; కో
మల జలజాత పత్రముల మాటున
నేటికి దాగినాడవో!

లలిత మనోజ్ఞ మూర్తి, యళిరాజు,
మనోహర గాన సత్కళా
విలసితు, డార్ద్రచిత్తు డని
వేల వరించెను నిన్ను మల్లికా
లలన, యెరుంగ దింత యనురాగము
తేనెలతేట కంచు; కో

మల జలజాత పత్రముల మాటున
నేటికి దాగినాడవో!

"తేనెలం గూర్చి వలపుల దేటపరచి
ధన్యురా లయ్యె మీ చెలి తలిరుబోణి!
కాని విరతంబు మల్లిక కడనె యుండి
మందము గూర్పగ మా కొక్క పూవె చెపుమ!"

# కవికుమార!

నవవికస్వర దివ్య సౌందర్య మూర్తి
విశ్వసుందరి పరమ పవిత్రమూర్తి
ఉదయలక్ష్మి యవతరించె; నెదురు వోయి
స్వాగతం బిమ్ము గీతికా ప్రసవ మొసగి!

అవిరళ స్వేచ్ఛ పెన్కముం దరయ లోక
వారిదమ్ములు చిత్ర కాశ్మీర రుచుల
బూని విహరించు పశ్చిమ భూధరమున:
రజని రా నున్న దంచు తెల్పంగ రాదె?

శ్యామ లాంబర పరిణాహ సరసిలోన
ప్రణయ లీలా విహార విలాసిను లగు
తారకల గాంచుమా! నీ హృదయము నందు
భావ నక్షత్ర కాంతులు పర్వు నేమొ!

# విరివేడె

రంగు రంగుల సొగసుచీరల ధరించి
నవ్వు వెన్నెల గాయు క్రొన్ననల నడుమ
వాడి వాడని యీ విరివేడె తాల్చు
మంచుముత్తియముల గన మది కరంగు.

# అన్వేషణము

"తలిరాకు జొంపముల నం
దులత్రోవల నేల వాలు తుహినకిరణ కో
మల రేఖవా! పువుదీపవా!
వెలదీ, యెవ్వతెవు నీపవిటపీవనిలోన్?

కారుమొయిళ్ళ కాటుకపొగల్
వెల్లగక్కు తమాలవాటి నే
దారియు కానరాదు, వెలతా!
యెటుపోయెద వర్ధరాత్రి – వి
స్ఫార విలోచ నాంధ తమసమ్ముల
జిమ్ముచు, వేడి వేడి ని
ట్టూరుపులన్ నిశీథ పవ నోర్మి
వితానము మేలుకొల్పుచున్?"

"అది శరద్రాత్రి: శీత చంద్రాత పాంత
రాళ రమణీయ రజత తల్పంబునందు
చల్లగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకల గోపాల గోపికా జనముతోడ.

పాము సడలిన పతి పరిష్వంగమందు
సుఖము దుఃఖము లేని సుషుప్తిలోన
స్వప్నవీథీ యథేష్ట సంచార కలన
మేను మరచిన నన్నంత మేలుకొలిపె
శర్వరీ శీత పవన పక్ష్మముల మలసి
స్వాదు యమునోర్మి సంగీత ఝరుల గలసి
కౌముదీధౌత శుభ్ర దిక్తటుల సోలసి
మురళికా మందమంద మాధురుల రుతులు.

ఎలదేటి విరుపాట సెలయేటి కెరటాల
బడిపోవు విరికన్నె వలపువోలె
తీయని మల్లెపూదేనె సోనల పైని
తూగాడు తలిరాకు దోనెవోలె
తొలిప్రొద్దు తెమ్మెర త్రోవలో పయనమై
పరువెత్తు కోయిల పాటవోలె
వెల్లువలై పారు వెలది వెన్నెలలోన
మునిగిపోయిన మబ్బుతునుకవోలె

విరుత తొలకరివానగా చిన్ని సొనగ
పొంగి పారలెడు కాల్వగా నింగి కెగయు
కడలిగా పిల్లగ్రోవిని వెడలు వింత
తీయదనముల లీనమైపోయె నెడద.

పరుపు పరుపున పోవు నెదతో
పరువు లెత్తితి మరచి మేనే
మరచి సర్వము నన్ను నేనే
మరచి నడిరేయిన్."

"ప్రాణనాయకు కౌగిలి పట్టు వదలి
యిల్లు వదలి యెన్నండు నీ వల్లె వదలి
యడుగిడని దాన; వా నాటి యర్ధరాత్రి
విజన పథముల బడి యెట్లు వెడలినావు?"

"తావులతోడ తేనియల
ధారల చిప్పిలు వేణుగీతికా
రావముతోడ మందగతులన్
జను మారుతముల్ విశాల బృం
దావన వీథులందు యమునా
నవభంగ మృదంగ వాద్యముల్
శ్రోవ స్ఫురింపగా వలపు
తొందర వెట్టగ లేచి నొంటినై.

నన్నని యెచ్చటితి జాలిగా నెవరినో
యరయుమా! పిలుచుచున్నదియె యమున!

ప్రక్క నిర్జీవ ధావళ్యమ్ముతో నున్న
  సికతాతలమ్ము గాంచితివె, దాని?
తుది మొదల్ లే దిదే త్రోవరుల్ త్రొక్కని
  యీ దారినే పరువెత్తినాను!
ఈ మొండిచేతుల నెత్తి యీ వనతరుల్
  శూన్యదృక్కుల దిశల్ చూచు నయ్యొ!
ఇచటనె, యిచటనే యత; డిచట నేను -
ఇచట నీ జాజిపూ పొదరింట నేను -
ఈ కడిమిచెట్టు క్రింద సుమ్మా యతండు -
సరిగ కన్నుల గట్టిన సరణి దోచు.

శారద శర్వరీ మధుర చంద్రిక,
  సూర్యసుతా స్రవంతికా
చారు వినీల వీచిక, ప్రశాంత
  నిశా పవనోర్మి మాలికా
వారిత పీన శాఖిక, కృశాంగిని
  గోపిక నేను, వాడు బృం
దా రమణీయసీమ వినినారము
  మోహన వేణుగానమున్.

మలయ పవను కౌగిలిలోనె పులకరించి
హాయిగా కంఠ మెత్తు ప్రాయంపు వంశి

విశ్వవిమోహను జిలిబిలి పెదవు లంటి
యవశమై పోయి యేమి చేయంగ లేదు!

బాలగోపాలు బోలెడు పాటగాని
కని విని యెరుంగ మెన్నండు; కరములోని
మురళినే కాదు, నాలోని మ్రోడు బెడద,
నీ శిథిల జీవనమ్ము మ్రోయింప గలదు.

నందగోప కుమారు నానంద మురళి
కా మనోహర సుధా రావగా తరంగ
జాలముల తారకా రవి చంద్రతతులు
కరగి విని విన్ని గీతులై కలిసిపోవు.

చూచితివా లేదా విన్ని కృష్ణుని సొబంగు?
పెదవి విప్పురు సంజల నరవిచ్చు నవ్వు
వెన్నెల, చలించు తుమ్మెద బెళుకు చూపు,
లోల పవన చాలిత కుటి లాలకమ్ము,
తరళ చూడా కలాపమ్ము, మురళి గూడి
యల్ల నల్లన గొంతెత్తి యమృతగాన
శీతల తుషారముల విరజిమ్ము వేళ
విన్నికృష్ణుని సొబగు చూచితివా లేదా?

లేవు శర త్తమస్వినులు
　　　లేవు మనోజ్ఞ సుధాంశు మాలికల్
లేవు వినీల నిర్మల కళిందసుతా
　　　నవనాట్య సంపదల్
లేవు మదీయ గాత్ర లవలిం
　　　బుల కాంకుర కోర కావళుల్
లేవు కుమారగోప మురళీ
　　　మృదుగీత ఝరీ విలాసముల్ !

జిలిబిలి పట్టురేకుల వెన్క తొట్రిలు
　　　మల్లియ రొద దాగు మధుప రవము
కనుచూపు దాటు నామని బాయు కోయిల
　　　గొంతులో వెక్కు వసంతగీతి
విభు వీడి శుష్కించు విరహిణి సెలయేటి
　　　కడుపులో నడగిన కడలి మ్రోత
రేనికై వెదకెడు రిక్కచూపుల లోన
　　　చెరపడ నిండుచందిరుని పాట
యిట్టు లీ దీన గోపికా హృదయ మంది
రాంతరాళము లోన త్రుళ్ళింత లాడు
వేణు నాదంబు, వినిపించు విశ్వమోహ
నాకృతి కిశోరగాయకు నరయుచుంటి.

ఇది నా చరితము; విని నీ
వదరెదు తొట్రిలెదు వడకు దటు నిటు కనుల
జెదరెదు చూపుల నేదో
వెదకెదు! ఎవ్వతెవు నీవవిటవీవనిలోన్?"

# విశ్రాంతి

నీలాభ్ర సరసిలో సిందుజాబిల్లి
రాయంచ వలె విహారము సల్పుచుండె;
కమ్మ తెమ్మెరలు శాఖా పత్రములనొ
కల్లోలినీ తరంగములనో డాగె;
నాట్యంబు మధుర గానంబును మాని
గాటంపు నిద్దుర గాంచె శైవలిని;
సర్వేశ్వరుని హస్త జలజ యుగ్మమున
విశ్వమే హాయిగా విశ్రాంతి జెందె!

# మహాకవి

(గురజాడ అప్పారావు)

గుత్తునా యని జాతి ముత్యాల్
గుచ్చినాడే మేలి సరముల
ఇత్తునా యని తెలుగుతల్లికి
ఇచ్చినాడే భక్తితో!

నవ వసంతము నవ్య వసరమ
మావి కొమ్మల కమ్మ చివురులు
పాట పాడెడి పరభృతంబును
ఎవ్వ రావుదురో?

పొదుపుమల పయి రంగవల్లిక
మింటి నడుమ ప్రచండ తేజము
పంజమబ్బుల పైని కెంపులు
మాడ రైతిరిగా!

రంగవల్లిక మాయ మయ్యెను
చండ తేజము మాసిపోయెను
పండె కెంపులు పాగిపోయెను
వెదకుచున్నారా!

కారుచీకటి క్రమ్మినప్పుడె
వదలు మబ్బులు కప్పినప్పుడె
మిణుగురైనను మెరయనప్పుడె
వెదకుచున్నారా!

పక్కులన్నియు పొక్కిపోలేను
గిరులు కదలెను, తిరుగ పాడెను:
లోకమోహన మధురగానా
స్వాదమోదమున.

యుగయుగంబులనుండి మ్రోగెడు
విశ్వగాన వియత్తరంగిణి
భంగముల నుప్పొంగు నాతని
గీతశీకరముల్

పాట పాడిన పరభృతంబును
మూగవోయిన ముద్దుకోయిల
విన్ని పికములు విరుతపాటల
పిలుచుచున్నవియా!

# అతని పాట

సంజ ముద్దుమొగంబు కెంజాయ గప్ప,
కన్ను లల్లన నరవిచ్చి, గగనవీథి
మెల్లగా చల్లగా సాగు మేఘు మీద.
తరళ మోహన వీక్షణతతులు నిల్పి,
మంద మలయానిలోర్మికా మాలికలను
లలిత సుకుమార మధుర బాలస్వరంబు
నెత్తి, పాడితి వేమేమొ హృదయకమల
వికస నోద్బోధకం బగు వింతగీతి.

సందెవేళ, పొలముగట్టు, చల్లగాలి,
చేతిలో చేయి, నునులేత చిత్తములును!
ఈవు నేనె పట్టు లటుల నేమి యనక :
సర్వమును జేర నొక్క యపూర్వభావ
ముదయ మయ్యె కుమార, నా హృదయ మందు!
మొగము గంటి, కనుల గంటి, మొగిలు గంటి
పాట వినుచుంటి....

# లోకము

పొడుపుమల పయి బంగరు మ్రుగ్గు లుంచి
సంజమబ్బుల కుంగరాల్ సంతరించి
పోవుచున్నావు, నీ వేమి పొంది తోయి ?
వెర్రి మిత్రుడ, లోకంపు విధము కనవా ?

మధుర మకరందరసమును మధుపమునకు
పుప్పొడి దుమారము సమీర పుత్రకునకు
నిచ్చితివి కావె, నీ యంత నీవె పిలిచి
తరళ తుహి నాశ్రు లేల గేదంగివదువ ?



తోయముల తీయ నైన పానీయ మొసగి
వలపు నునులేత గాలి వీవనల విసరి
ప్రబల నైదాఘ తీవ్రాతపంబు వలన
**నిట్టు లైతివె** సెలయేర, తుట్టతుదకు !

# ఏల ప్రేమింతును?

సౌరభము లేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?

మావిగున్న కొమ్మను మధుమాసవేళ
పల్లవము మెక్కి కోయిల పాడు టేల?
పరుల తనియించుటకొ? తన బాగు కొరకొ?
గాన మొనరింపక బ్రతుకు గడవ బోకొ?

# దివ్యభాగ్యము

హేమమణిరత్నగణ మేల లేమ, మనకు?
సాంధ్యసమయ సువర్ణితచ్ఛాయ లరసి
తారకా శోభి తాంబరతలము గాంచి
వింతలను బాయుదము చేయి జేయి కలిపి!

ముత్తియంపు సరము లేల, ముదిత మనకు?
వలపు బాటల త్రుళ్ళింత తేలయు నాడు
సెలల తరగల నురువుల చెలువు జూచి
ప్రీతి నుందుద మలతి కోరికల బాసి.

సార్వభౌమభోగము లేల బాస, మనకు?
ఏలికల మోద మన్యోన్య హృదయములకు!
ప్రవిమల ప్రేమసామ్రాజ్య పట్టభద్ర
భాగ్యముం గన్న నితరసంపద ల వేల?

# నా ప్రేమ

క్రౌర్య కౌటిల్య కలుష పంకంబు వలన
మలిన మౌ నా హృదయము ధామ మెటు అయ్యె
నతివిశుద్ధము మధురము నఘరహితము
ప్రణయమున కంచు సందియపడుదు వేమొ!

ప్రేయసీ! శర్వరీ తమోవీథుల బడి
చందురుడు రాడె పూర్ణతేజస్వి యగుచు?
అఘవిదూషిత మీ హృదయంబునందె
ప్రేమ కోమలతమము పవిత్ర మయ్యె.

# విరిసి విరియని ...

విరిసి విరియని క్రొవ్విరి నరయుటకును
ఎంతో నందియవడ, స్పృశియింప గలమె?
వలపుల హారింప గలమె? యౌవనము నాత్మ
వికసితము ; కలుషహృదయము వెరపు జెందు.

# ప్రాణకాంత

ప్రణయ మల యానిలోర్మికా పటలి నాగు
సౌరభమ, గానమా, నిందుకాంతి నిండు!
ప్రాణమునకును బ్రాణ మౌ ప్రాణకాంత
యూర్పుతరగల నోలాడి యున్నవారె?

ప్రణయ నీరజ మధుర సౌరభము గ్రోలు
హిమకణమ, తేనెవిసుక, మీ రిందు కాంతి!
ప్రాణమునకును బ్రాణ మౌ ప్రాణకాంత
యెడద శోధించి యశ్రులై పడిరె యిచట?

ప్రణయ విమలాంబ రాబ్ధి గర్భమున దేలు
నీరదమ, నీలమా, యిందు నిండుకాంతి!
ప్రాణమునకును బ్రాణ మౌ ప్రాణకాంత
మానసక్లేశ లవ మూని మారినారె?

ప్రణయ వన తరుశాఖల పల్లవించు
తేటిమ్రోత, కోయిలకూత, తెందు కాంతి!
ప్రాణమునకును బ్రాణ మౌ ప్రాణకాంత
విరహగీతిక లప్పుడె జెప్పెదరో యేమొ!

# మాటిమాటికి

ఎద జనిన మనోహారి జాడ లరసి
కలగు హృదయంబు, నెమ్మది చలన మొందు
కనులు మూసిన, లోకమోహన మనోజ్ఞ
మూర్తి చిరునవ్వు జిలుకుచు బ్రోల నిలుచు.

హృదయ మర్కట! నవసుమ మృదుల మగుట
విరహ బాధ కన్నీరుగా వెడలరాదె?
అతి భయంకర సాంద్ర నీలాభ్ర పటలి
వాన గురిసిన ధవళిమ బూను గాదె?

పూత గోదావరీ స్రవంతీ తరంగ
మాలికా డోలికల నూగు మలయ పవన!
ఏల కొంపోవు, హృదయంబు నేర్చి వెడలు
వేడి నిట్టూర్పు గాడ్పుల వెలది కడకు?

పొంగి కిలకిల నవ్వి యుప్పొంగి పొరలు
తరగలార, నా బాధల దలప రయ్యొ!

ప్రాణనాథుండు మీ యుడురాజు మిమ్ము
వీడి నప్పుడు త్రుళ్ళింత లేద కరుగు?

జలనిధులు దాటి యున్న తాచలము లెక్కి
హృదయ మది యేమొ క్రిందు మీ వెరుగకుండ
పక్షివలె రెక్కలం దాల్చి పరువు లిడుచు
మాటిమాటికి వలపుల పేటి కడకు!

# ప్రేయసీ!

ప్రేయసీ, ప్రేయసీ! ప్రియుడనే ప్రేయసీ!
వేయి కన్నులు దాల్చి వెదకుచున్నానే!

నల్లమేఘాలలో నాయమా దాగంగ?
తల్లడిలవో నన్ను తలచి రావో!

మెరపువై యొయ్యారి యొరపువై కాన్పించి
యరసి నంతనె మబ్బు తెరల దాగితివా!

తళుకు మని కనిపించి వలపు వెల్లువ ముంచి
వలపించి మాయమై వనట గూర్చితివా!

"నల్లమబ్బుల నింగి నా సౌధ రాజమ్ము
నల్లమబ్బే ప్రియుడు నన్ను గోరకుమా!"

ఆడుమను బాడుమను హాయిగా నవ్వుమను
పాడు మేఘాలతో పరుగెత్తె మెరపు!

# కిలకిలని ...

కిలకిలని నవ్వు వెలుగులతో కలసి మెలసి
పూవువై మబ్బువై చిన్ని పుల్గు పాప
ప్రసవ కోమల రమణీయ పథము పట్టి
పోవుచుందువు లావణ్య మూర్తి నీవు.

ఏనా దీనుడ నే నీడ నైన నాదిగి—
అడు గిడగ లేక నిట్టూర్పు విడువ లేక
పారలు కన్నీటి కాల్వలు గురియ లేక—
ఏనా దీనుడ నే నీడ నైన నాదిగి
కాంచెదను నిన్ను కనులార కరవు దీర!

ప్రసవముల జల్లి గానసౌరభము లల్లి
ప్రతిమ లానంద నృత్యోత్సవముల దేల్చి
నిన్ను వలపింప బూనుదు రెన్నొ గతుల.

ఏనా దీనుడ నే నీడ నైన నాదిగి—
హృదయ నేతవు భవదీయ వదనరోజ
మృదు రజోలేశ దివ్య సంపదను వలచి

ఎడద కలగించి విదళించి యేర్చి వెడలు
వేడి నిట్టూర్పు గాడ్పుల పెదవు లదర
నా మనోహారి నిన్ను గన్నార గాంచ
నలవి గాకుండ దుఃఖాశ్రు సలిలమౌక్తి
కం బొకటి నాదు ప్రణయ వీక్షణము గప్ప—
ఏనా దీనుడ నే నీడ నైన నాదిగి
మ్రోడు నై రాయి నై నిల్చిపోదు నకట!

# ఆరని దివ్వె

హృదయ నాళము తెగియె, నా హృదయ ధనము
తొలగి పోయెను, జీవితఫలము స్రుక్కి
నేల బడె, నింక జీవింప నేల సఖుడ?
వలపె విష మైన తుచ్ఛజీవనము విషము.

ప్రణయభంగ ప్రభూత తాపజ్వరార్తి
నెటులు భరియింతునో సఖా? యిటులు మనసు
కడు భరం బైన వలపుచే తడిసి తడిసి
హృదయ మయ్యెయొ! నవనీత మృదుల మయ్యె

అతిమనోహర మూర్తి వై యభ్రవీథి
తోచినంత నీకై చేయి చాచ బేల?
శ్రావణ శ్యామల క్రూర జలద పటలి
మాయ మైతె సౌదామినీ! మమత గొలిపి.

కోపమున జేరి నీ కానగోళ్ళ కూరి
యిట్టి విరునవ్వుతో పీల్చి హృదయ పుటము

రక్తధారలు ద్రావగా ర, మ్మెటైన
ని న్ననను, జచ్చినను మన్న నీకె నేను !

జీవితంపు నిరాశచే జిక్కి చిక్కి
ప్రాణమే పోయినను నిన్ను పాయలేను !
వాయువై పోయి వెన్వెంట సాగుచుందు,
నీ వెత హరింతు సుఖ మెల్ల నీకె యుంతు.

అవిర తానందముం బొందు నపుడు నన్ను
మరచిపోదువు; సరె యట్టి మరచిపొమ్ము !
ఘోర దుఃఖ తమంబున కుందు నపుడు
తెరచి హృదయంబు, నారని దివ్వె నిత్తు !

# అయ్యో!

స్వచ్ఛ మైనట్టి ప్రణయంపు సలిలధార
పోసి పెంచిన స్నేహంపు పూలతీవ
తావులను జిమ్ము నలరుల దాల్చుకుండ
గాలితాకున నేలపై వ్రాలె నకట!

సంజవేళల పవడంపు ఛాయ లటుల
చిరుత ప్రాయంపు కోరికల్ చెదరిపోయె;
పర్వత శ్రేణి నిర్ఝర పంక్తు లట్లు
ఆశయము లెల్ల నడుగంటి యంతరించె!



మత్తిలిన యొక్క చంచల మధుపమునకు
కోలుపోయితి మకరందజాల మెల్ల
ఇంతలో పీవి యెచటికో యెగిరిపోవు
మారుతముతోడ వలపులు మాయ మయ్యె!

## నవ్య మోహన ...

నవ్య మోహన కోకి లానంద గీతి
దరవికస్వర సుమ మనోహార సుగంధ
మనిల భంగంబులను గొట్టుకొనుచు బోయె
నెచటికో యని వింతిల నేటి కోయి!

# నా విరుల తోట ...

నా విరుల తోట పెంచికొన్నాడ నొక్క
పవడపు గులాబి మొక్క నా ప్రణయ జీవ
నమ్ము వర్షమ్ముగా ననయమ్ము కురిసి.

కొన్ని నాళ్ళాయె; సుకుమార కుసుమ మొకటి
నవ్వె కిలకిల మని నా వనమ్ములోన.

అంత దానినె, నా జీవి తాశయమ్ము
పూవుగా వింతగా మారిపోయి నటులు
వలచికొన్నాడ;



నా ప్రసవమ్ము నేను
నన్ను మనసార నా ప్రసూనమ్ము. కనులు
విచ్చి కాంచుచు కాలము పుచ్చినాము
ఎదల నిశ్శబ్దముగ పల్కరించుకొనుచు.

ఎట్టు లది దాపురించెనో యేమొ యంత
నాకునందుల త్రోవల నల్ల దిగియె
నొక్క క్రూరార్క కిరణమ్ము: ఉర్వి వాలి
నా గులాబి సోలి తూలి నన్ను వీడె.

అపుడు నావైపు మోచి నా యలరు లేని
శూన్య మా మ్రోడు మ్రాకును జూచి, యొక్క
కోకిలమ్మ కో యని యేడ్చె గొంతు నెత్తి!
మా కొరకు దారి బోయెడు మందపవను
డాకడు జాలిగ నొక్క నిట్టూర్పు వినరె!

# చిన్ని పూవే ...

చిన్ని పూవే వాడెనా
తన
కన్నె వలపుల వీడెనా
తన
చిన్నె లన్నియు వన్నె లన్నియు
మన్నులో కోల్పోయెనా?

కాంతు నెరుగని కన్నె గాదా
సిగ్గు వీడని మొగ్గ గాదా
మొన్న మొన్ననే ముద్దు పల్లిని
మొనలు దీరెనుగా!

## లోకమా!

ఏటి పని యిది లోకమా! హృదయ దళన
దారుణ మహోగ్ర కార్యంబు తలచినావు;
ప్రణయ మధురిమ మెరుగవు, పాప మనవు,
పక్షములు దూల్చి, బంధింతు పంజరాన;
వెర్రి లోకమ! హృదయంపు స్వేచ్ఛ నెటులు
పంజరంబున బంధింతె? పాదపమున
కూడియుందు మెల్లప్పుడు కొమ్మమీద
ప్రవిమల ప్రేమ విహగ దంపతుల మగుచు!

# శాపము

నవ వసంత శుభోద యానందవేళ
ప్రకృతి నూతన జీవలావణ్య మొంద
రాయి రప్పయు కంఠస్వరంబు దాల్చి
నైజగుణము త్యజించి గానంబు సేయ
పికము, పాడకు మనుచు శపించినారు!

## పక్షినని ...

పక్షి నని పాడగల నని ప్రణయవీథి
నిత్య లీలావిహారముల్ నెరపుదు నని
పక్షముల దూల్చి, బంధించి పంజరాన
గానమును ప్రాణము హరింప బూనినారు!

# అబ్బ!

హృదయ వనజాత సుమ
మృదు మనోహర దళము
లదయతను ద్రుంచినారే
పెంధూళి
విదిమి వెదజల్లినారే!

హృదయ శోణిత ధార
వెదుగు జీవిత వల్లి
మొదలంట దూల్చినారే
భయ దాగ్ని
కీలలను వ్రేల్చినారే!

## *చుక్కలు

మింట నెచటనో మెరయు చుక్కల
కంట చూచితి కాంక్ష లూరగ
కాంక్ష లూరినకొలది చుక్కలె
కాంచి బ్రదుకే గడపితిన్.

చేతి కందెడు పూలకోరకై
చేయి చాపక చేరి కోరక
దూరముగ లే వంపు వానిని
దూరి వదలితిని.



మింట చుక్క అదృశ్య మాయెను
చేతి కందెడు పూలు వాడెను
సారహీనపు జీవితమునకు
కోరికలె మిగిలెన్.

పక్షివలె నాకాశ నిర్మల
పథ విహారస్వేచ్ఛ గోరితి

వక్షములు లే వం వెరుంగక
ప్రాకులాడుచు పొగిలితిన్.

ముగిసి చనె నూరేళ్ళ బ్రదుకిటు
మూడు నాళ్ళకె ముక్కలాయెను
మోడు మ్రాకై పూయకుండగ
వాడి తూలిన తీవనై.

తళుకు బంగరు తార లేలా?
తలకు మీరిన తలపు లేలా?
వలచి పొందగ గగనకుసుమములు
కలయె జీవితము ?

## ఆశ

కన్నీటి కెరటాల వెన్నె లేలా ?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి యేలా?
ప్రళయకాల మహోగ్ర భయద జీమూ తోరు
గళ ఘోర గంభీర ఫెళఫె ళార్భటులలో
మెర పేలా ?

అశనిపాతమ్ముతో నంబు వేలా ?
హాలాహలమ్ములో నమృత మేలా ?
ప్రబల నీరంధ్రాభ్ర జనిత గాఢ ధ్వాంత
నిబిడ హేమంత రాత్రీ కుంతలములలో
చు క్కేలా ?

శిథిల శిశిరమ్ములో చివు రేలా ?
పాషాణపాళిపై ప్రసవ మేలా ?
వికృత క్రూర క్షుధా క్షుభిత మృత్యు కఠోర
వికట పాండుర శుష్క వదన దంష్ట్రాగ్నిలో
న వ్వేలా ?

కన్నీటి కెరటాల వెన్నె లేలా ?
నిట్టూర్పు గాడ్పులో నెత్తావి యేలా ?

# నే నొకండ!

ఎంత బరు వయ్యెనో గాని యెడద వెలికి
తొలగి పారని దుఃఖాశ్రు జలము వలన
ప్రావృ డంభోధర స్వామి, నీవు కూడ
నా వలెనె జాలి వొడమ వాపోవుచుంటి
ఒక్క టొక్కటె కన్నీటిచుక్క లొలుక
నేడ్వ లేక యేడ్వ లేక యేడ్చుచుంటి.
నెచ్చెలీ, యే నెరుంగుదు, నీవు కూడ
నొక్కమారు గాటంపు నిట్టూర్పు విడుతు,
తెలియ రాని తెలుప లేని తీక్ష్ణతాప
మెదిరెము లోలోన నిన్ను వేగించునేమొ!

ప్రావృ డంభోధర స్వామి, జీవనంపు
భారము తొలంగి పోవ నెవ్వారి కేని
కోరి నీ పాదలను జెప్పుకొందు వేమొ -
గొణుగు కొనుచుండు వయ్య, యొక్కొక్కవేళ
ఇట్టె విలపించి కృశియింతు నేను, నీవొ
హొరారు హొరారున నీ మనసార నేడ్చి

జిలుగు వలిపెంపు వన్నె చీరల ధరించి
కులుకు నవ్వుల పవడాల తళుకుతోడ
పొడుపువెలి కడకో, సంజపడతి కడకొ
పోయి యాటల పాటల ప్రొద్దు పుత్తు.

ఎడతెగని యాత్ర నిట్లు సాగింప లేక
యుద్వ్వగా లేక కృశియింతు నే నొకండ!

# దుఃఖము

దినము దినమెల్ల నైదాఘ తీక్ష్ణ భాను
భీకర కరానలవ్యాప్తట వేగి వేగి
శీతల నిశా ప్రశాంత శయ్యా తలాన
నిట్టి కనుమోడ్చి గాదె నా హృదయనుమ్ము!
అలనటుం దూలి, నిర్జీవ మటుల సోలి,
జాలి గొల్పును గాదె! నీ వేల వ్వచ్చు
మటుల లోలోన కలచి, చీకటిమునుంగు
నొత్తిగిల ద్రోసి. వదలని హొత్తు గోరి
తొంగి తొంగి చూచెద వయ్యొ దుఃఖమా! రొ
కింత కైనను జాలి వహింపవ వేమి?
నగము వాడిన మృదుల పుష్పమ్ము నమ్ము,
నిదుర పోనిమ్ము లేకున్న నేల వ్రాలు!

# ఓయి సంధ్యా సమీరణా

ఓయి సంధ్యా సమీరణా. రేయి తోడి
కారు చీకటి తోడ దుఃఖమ్ము కూడి
పరువు పరువున నా కోరి కరుగు వెంట
నీదు సనులేత రెక్కల మీద వడిగ
నెత్తికొని పోవరాదె న న్నెచటి కేని
నిత్య తేజో మ యానంద నిలయమునకు!
నిముస మేనియు నిట నుండనేర నోయి!

సంజ మబ్బుల పవడాల చాయ లందొ
తరణి బంగారు కిరణాల మెరుగు లందొ
లీన మొనరింప రాదె యీలోన నన్ను?
మధుర సంధ్యా సమీర కుమార. దీన
మనవి విని యేగ రాదె యే మలయగిరికో?
మధుర సంధ్యా సమీర కుమార. నన్ను
తోడుకొని యేగరాదె నీతోడ గూడ!

# నిశాలోచనము

రెక్కలం దాల్చి పరతెంచు రేలతాంగి
కారు కాటుక వీర సింగార మొదవ
చీకటి చెరంగు విసరున చెదరి యొక్క
యుడుమణి విషాద పూరిత ద్యుతులు రాల్చు;
పాడుకొను వేగు జాలిగా పవన మొటకా
రజని గర్భాన వింత విలాప గీతి;
ఎద కరుగునట్లు నన్నని యెలుగు తోడ
నట్టి తల లెత్తి పాట కూకొట్టు చేద్బు
గాతమీ వీచికాళి నగంబు నిదుర;
నేను నా దుఃఖమే తోడునీడ గాగ
గడపి కొనుచుందు నిశ యెల్ల కనులు దెరచి;
ఇదియె యద నని తలచి, నా హృదయ పేటి
ముంచుకొని వచ్చు భావజీమూత చయము
కలిపివేతు తమస్వినీ గర్భ ముందు !

# వద్దు!

నీ

కనురెప్ప కొనల నొక
విను కైన కదలనీ,
ప్రళయకా లానంత భయద పాథోరాశి
వలె విశ్వమెల్ల ముంచెత్తు నమ్మా!

నీ

పెదవి విప్పురుల నొక ని
డుద యూర్పు విసరనీ,
కాలాంత బలవ దాభీ లానిలముగ లో
కాల త్రుటిలో నూడ్చివేయు నమ్మా!

నీ

పువు బెడద నొక శోక
లవ మైన రేగనీ,
ఆ మహానట గళోచ్ఛలిత హాలాహల
మ్మై మిన్ను మన్ను దహియించు నమ్మా!

# నన్ను గని ...

నన్ను గని యేరు జాలి జెందంగ వలదు —
ఎవ్వ రని యెంతురో నన్ను? — ఏ నవంత
శోకభీకర తిమిరలో కైకపతిని!
కంటకకిరీట ధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందిరంపు
కొలువుకూటాల, నేకాంతగోష్ఠి దీర్చి,
దారుణ దివాంధ రోదనధ్వనుల శ్రుతుల
పొంగి యుప్పొంగి యుప్పొంగి పొరలి పోవ
నా విలాప నినద గీతి కావళీ వి
రావముల నర్ధరాత్ర గర్భమ్ము, మరియు
మరియు భీషణ కాళి మోహన్మత్త గాగ
చేయు తరి, నన్ను మీరు వీక్షింప లేదా!
నన్ను గని యేరు జాలి జెందంగ వలదు —
నాకు నిశ్వాస తాళవృంతాలు కలవు.
నాకు కన్నీటి నరుల దొంతరలు కలవు.
నా కమూల్య మపూర్వ మానంద మొసగు
నిరుపమ నితాంత దుఃఖంపు నిధులు కలవు —
ఎవ్వ రని యెంతురో నన్ను? —

# నేను కూడ

ఏను మీ వలెనే కంఠ మెత్తి పాడ
నెంతొ యుబలాటపడి సవరింతు గొంతు;
ఏను మీ వలెనే న వానూన గాన
విస్తృత వ్యోమ యానాల వెడలి వెడలి
భావలో కాంచలమ్ముల వాల వలతు!

ఐన నే మాయె! అవుకోలేని పాట
యెడద రొదపేయునో లేదా యింకిపోవు
నంతలోననే కటకటా! యంతులేని
దారిలేని శోకంపు టెడారు లందు!

అంత లజ్జా విషాద దురంత భార
వహనమున కోర్వ లేని యీ పాడు బ్రతుకు
వంగిపోవును మరిమరి క్రుంగిపోవు
లో తెరుంగని పాతాళలోకములకు!

మూగవోయిన నాగళమ్మునను గూడ
నిదురవోయిన సెలయేటి రొదలు కలవు–
ఐన నే మాయె –

# మీరు మనసారగా ...

మీరు మనసారగా నేడ్వనీరు నన్ను -
నన్ను విడువుడు ! ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవని కాభ్యంతరమున
వెక్కివెక్కి రోదింతును - విసువు లేక
విరతి లేక దుర్భరశోక విషమ గీతు
లేడ్చి వైతు ; ఎలుం గెత్తి యేడ్చి వైతు.
ఈ మహానంద వీచికా స్తోమ డోలి
కాగ్రముల నింక నే నాట్య మాడ లేను ;
నేను చిరునవ్వు పెదవుల నిలువ లేను ;
ఏ విరామ మేని లేని యీ శుభోత్స
వ ప్రణయకేళికా మోద భార మింక
నేను వహియింప లేను, జీవింప లేను !

# స్వాదు సంగీత ...

స్వాదు సంగీత కలనా లన ద్విపంచి
కరమునం దుంచి జీవిత భరము వాయ
పాడుకొమ్మంటి తియ్యని ప్రణయగీతి;
తంతులను ద్రెంచి మెట్లు విదల్చి స్వామి!
ఎటుల పాడుదు, నీ బ్రదు కెట్లు వుత్తు?

స్వాదు మకరంద పౌర భామోద కుసుమ
దామ మిడి నాదు కంఠాన దాల్చు మంటి;
రేకు రేకుల విడిమి ధూళి వెదజిమ్మి,
ఏది మనసార ధరియింతు, నెటుల మనుదు?

రాజరాజేశ్వరులకు నలభ్య మైన
పదమ లామూల్య తారకా సదృశ దివ్య
మణి విరాజిత కల్యాణ మకుటరాజ
మిడితి నా మస్తకాన వహించు కొనగ;
నేలపై పారలించి పాదాల మెట్టి
యకట! గిరవాటువైచి యాశాంతములకు
పేదనైపోయి యెట్లు జీవింతు నోయి?

ఎక్రైవెక్కమం

# ఈ నిశీథ మధ్యమ్మున ...

ఈ నిశీథ మధ్యమ్మున నే నొకండ
ఘోర కాంతార కుటిల కఠోర వీథు
లందు తిరుగాడుదును భయమంద గాని
లోకమోహన తారావిలోకనముల
వలదు కనుసైగ చేయగా వలదు నాథ !

ఇంచు కేనియు వెరవ స్వామీ, త్వదీయ
పాణినిర్గత నిర్ఘాత పాతమునకు ;
ప్రళయ ఝంఝా ప్రభంజన ప్రబలధాటి
వడకు శైశిరవల్లికా వ్రత మటుల
హృదయము చలించు భవదీయ వదనసీమ
ప్రణయ దరహాస కౌముది పరిమళించ !

ఇ మ్మహావిశ్వ మల్లలాడించు నీదు
బొమముడి కషాయ వీక్షణస్ఫూర్తి విమ్ము !
బురదలో క్రుళ్ళి పొరలాడు పురుగు నెత్తి
కాంత, చేర్పుకు మోయి నీ కౌగిలింత !

# ఏను గాటంపు నిద్దురలోన ...

ఏను గాటంపు నిద్దురలోన మేను
మరచువేళల భవదీయ మధురవేణు
మృదులగాన వక్షముల పై మెల్ల మెల్ల
నేగుదెంచి మామక శుష్క హృదయపాత్రి
నింపివైతువు ప్రణ యార్ద్ర నిస్స్వనముల!

అంత మేల్కాంచి యెంతొ దాహమ్ముగొన్న
శ్రవణముల విచ్చి నీ గీతరవము కొరకు
కడల పరికించి శూన్యలోకమ్ము కాంచి
హోరారు హోరారు మటం చేస్తు నోయి స్వామి!

# నా కాన్క

ఏది నీ కిత్తు నందువా హృదయనాథ!
కాన్కగా నే మొసంగగా గలను నీకు?
తారకారత్న భాసుర తారహార
సుప్రభా మాలికాజాల శోభితుడవు,
రాజరాజేశ్వరుడ వీవు, ప్రభుడ వీవు,
హృదయపతి వీవు! భవదీయ పదసరోజ
మృదు రజోలేశ దివ్యసంపదను వలచి
వీథివీథుల వాడల విపినములను
భిక్షుకునిబోలె తిరుగాడు పేద నోయి!
కాన్కగా నే మొసంగగా గలను నీకు?
గాఢ లజ్జానుతాప సంకలిత హృదయ
నీరజదళాల రాలు కన్నీటిచుక్క
గాక - మనసార, వల పూర, గలత దీర
గాన్కగా నే మొసంగగా గలను నీకు?

## కుంగిపోదు!

ఎట్లు ని న్నూహసేయుటో యెరుగలేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు!
రాజరాజేశ్వర కిరీటరాజ ఘటిత
రత్న మాణిక్య కాంతినీరాజ నార్చి
తాంఘ్రి నీరేజ యుగళుడ వయ్యు! వింపి
పాతలం గట్టికొని జీర్ణ పటకుటీర
పాళికా ప్రాంగణముల నివాస మేల?
శిథిలతర భాజనమ్ము నీ చేత బూని
తూలి సోలుచు నిరుపేద తోడ గూడి
యూవె దెసమాలి నటుల నింటింటి కేగ
నేల? దీనుడవై బిచ్చ మెత్త నేల?
చిత్రములు స్వామి, నీ వింత చేత లెల్ల!
ఎట్లు ని న్నూహసేయుటో యెరుగ లేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు!
కలుష బాష్ప కల్లోలినీ కణములందు
తళుకు తళు కని వాత్స్యాలునలువు నీ యు

నంత రా గాంచమాలికా కాంతి దేవ!
క్షామ దేవతా నిశ్వాస ధూమపటలి
చల్లగా వెల్లివిరియును స్వామి, నీదు
భవ్య కరు ణార్ద్రవీక్షణా పరిమళములు.
చండ మృత్యు గభీర గర్జారవముల
పల్లవింతువు నవ్య విపంచివోలె
మాధురుల జిమ్ము నీ కంఠ మంజురవము.
చిత్రములు స్వామి, నీ వింత చేత లెల్ల!

మౌనిగానమ్ములకు నింపు కేని గాని
మారు మాటాడగా బోవు, మన హానగవు.
శ్రితజనావళి సత్రమ సంసేవనముల
కలరి తల యూవ వీవు, 'కుం' యైన నవవు;
సార్వభౌముల వినయ పూజావిధాన
మెడదద మెచ్చవు, వారి కన్నెత్తి కనవు.
ఎట్లు ని న్నూహవేయుటో యెరుగలేక
వంగి వంగి శిరము వాంచి క్రుంగిపోదు!

పాపీ!

మలిన బాష్ప మౌక్తికమ్ము
మిలమిల నీ కనుల నిలువ
తళతళ మని తారలు నటి
యింతునురా పాపీ!

వేడివేడి నిట్టూర్పుల
వాడిన నీ పెదవు లదర
మోడు ప్రూకు చివురులతో
మురియునురా పాపీ!

భరియింపగ రాని లజ్జ
శిరము వంగి క్రుంగి నంత
తెరల దాటి చందమామ
నవ్వునురా పాపీ!

"దారి గాన లేను స్వామి!
రారా!" యని కంఠ మెత్త

గగనవీథి గంధర్వులు
పాడుదు రో పాపీ!

కురియుమురా కన్నీటిని!
మరిమరి విలపింపుమురా!
వరము గూర్చి వరమేజడె
తాల్చుమురా పాపీ!

# కన్నీరు

కలుష దుర్దాంత పంక సంకలిత కుహార
ముల జనించు మదీ యాశ్రు మలినధార
స్వామి, భవదీయ పాదదేశమున బారి
పరమపావన జాహ్నవీ ప్రతిభ గాంచు.

గాట మగు లజ్జవలన దుఃఖమ్ము వలన
నా కనుల జారు నుష్ణాశ్రు శీకరములు
హృదయము కలంచి విదలించి యేర్చి వెడలు
సాంద్రశోణిత బిందు వర్షమ్ము సుమ్ము!

తావకీన పదసరోజ దళములందు
నిలువని మ్మొక్క వేడి కన్నీటిచుక్క!
కడల ప్రసరించు నెత్తావి కమ్మదనము
త్రావని మ్మో ప్రభూ, దాని తనివి తీర!

# మా బాబయ్య, నాన్నగారు — 1

ఏ మనోహార సీమలం, దే పవిత్ర
విమల తేజోమయ విశాల వీథులందు,
అక్ష, రామోద సంభరి తాంతరంగు
లగుచు, విహరించుచున్నారొ, అమృతగాన
మధుర మందాకినీ భంగమాలి కాంబు
శీకర వితాన మోహన చిత్రనటన
మెన్ని యెన్ని రీతుల చూపుచున్నవారొ,
పూర్ణవికసిత జీవితపుష్ప కర్మ
సౌరభమ్ముల చిమ్ముచున్నారొ, ఎల్ల
దెసల భవదీయ సుందర దివ్యరూప
సవ్యరోచిస్సు కురియుచున్నారొ మీరు!

## మా బాబయ్య, నాన్నగారు — 2

ఏ నెరుంగుదు, చిర నూత నానురాగ
బంధముల కట్టువడుట, స్వప్నములనేని,
యెన్నడునుగాని, యెబ్బోటనేని, నిముస
మేని, యెడబాటు మీరు సహింపలేరు.

ఏ నెరుంగుదు, రామభూజాని మీరు,
కరము కరమున కీలించి, కాంతిసీమ
లందు, స్వచ్ఛంద నిత్యవిహారపరత
మెలగుచుందురు కాబోలు -

మీ యమూల్య



జీవితసుమాల నే నృపశేఖరునకు
నర్పణము చేసి, రక్తి సూరాజ్యవసీంద్ర
చంద్రు నొదల నాశీ షాక్షతల మీరు
చల్లుచుందురు కాబోలు -

# మా బాబయ్య, నాన్నగారు — 3

"జయము, జయము
లలిత సుమనోజ్ఞ కావ్య మంజుల లతాంత
మాలి కాభరణా! వినిర్మల విశేష
సుగుణమాణిక్య దివ్యతేజో విరాజ!
దీనజన హృదయాంతర స్థిరవిహార!
రామరాయేంద్రు శ్రీ సూర్యరాయ, జయము!"
అను స్తుతిధ్వానములు, జగ మంత క్రమ్మి,
యంబరపథాల మార్మ్రోగునపుడు, మీరు
ముప్వ రొండారులం గాంచి మురియునపుడు,
గర్వమున నృత్యమాడు మీ కంటిపాపు,
అధర సాంధ్యప్రభల దరహాసరేఖ,
మింట మిలమిల చుక్కలై మెరయునేమొ!
వెన్నెలై వినువీథుల విరియునేమొ!

# మా బాబయ్య, నాన్నగారు — 4

మీ పవిత్ర యశో నిర్మ లావ గాతి
శీతల తరంగజల సుధా సేవనమున,
కలుష కౌటిల్య కర్దమ మలిన మైన
మీ తనయు జీవితముకూడ పూత మయ్యె!

నాడు గొంతెత్తి మీరు గానమ్ము జేసి
నారు, భువనాలు తమ శ్రవణాలు విచ్చి,
'ఔ' నటంచు, 'ఓహొ' యంచు నాలకింప
విస్మ యాధిక సమ్మోద విభ్రమమున.

అంత హరిదంతముల గూడ నతిశయించి
పొరలిపోవు మీ గీతమాధురుల స్రోత
తన విపంచీ మనోజ్ఞ నిస్వనము ముంప,
కనుదామల నెత్తి, మో మెత్తి కదల గొంతు
భారతీదేవి యంగుళుల్ పాడ నంట!

దర నిమీలిత దివ్యనేత్రముల తోడ,
నపుడు, మీ పాటలోని యనంత నూత్న
రక్తి కలరి, కవీంద్ర సమ్రాట్టు, లేత
నగవుతోడ, శిరఃకంపనమ్ము సేయ,
విశ్వ మెల్ల శంపాప్రభల్ విరిసె నంట!

# మా బాబయ్య, నాన్నగారు — 6

ఎన్నడో మీరు పాడిన దీ వసంత
మధుర జీవనగీతి! హేమంత దీర్ఘ
యామినీ మధ్యవేళయే యైన. నేడు
కూడ, నా యెద, త్రుళ్ళింత లాడుచుండు:
నవ్య భాగీరథీ దివ్యనది విధాన.
నేడు కూడ సోత్సవ నృత్య మాడు లోన.

పొంగి, పరవళ్ళు త్రొక్కి, యుప్పొంగి, పొరలు
ఈ యమృతపూర్ణ సురవాహినీ తరంగ
శిఖరముల నాడు నొక కొన్ని చిన్ని చినుకు
లీ హృదయ గహ్వరము దాటి, యీ గళమ్ము
నతిశయించి, పైపయి చిందులాడుచుండు.

కనులు విచ్చి మనసు విచ్చి కాంచగలుగు
వారు తల యూచి మెచ్చుచున్నారు వాని.

# మా బాబయ్య, నాన్నగారు — 7

ప్రాజ్య పీఠపురీ మహారాజ్య భాగ్య
లక్ష్మి కొలువు దీర్చు వరత్న రత్నఖచిత
భాసమాన కల్యాణ సింహాసనమ్ము;
అది వెలమ శౌర్యమూర్తి రణావనీ వి
హార విక్రమ కేళి కానంతరమ్ము
శాంతి నందు విలాస విశ్రామ వేది;
అది సభాసీన సకల బుధావతంస
ఘన కవీశాన విజ్ఞాన కాంతిమ త్ప్ర
సన్న వీక్షణ స్నాపిత స్వర్ణ పీఠి;
అది మహీపతి రామరా యావనీంద్ర
కరకమల వీజ్యమాన చామర సమీర
పులకిత భవ న్మృదుశరీర భూషితంబు!

# నాకు మరణమ్మే ...

నాకు మరణమ్ము వల దనినాను; కాని
మరణ మను లేత నుడి చెవిం బడిన యంత
వడ వడ వడంకగా శిలాజడిమ గనగ
దలరుగాలికి శుష్కపత్రమ్ము కాను.

తుది మొదలు కాని కానరానిది; మహాంధ
కార కలుషిత కృష్ణపక్షంపు వీథి
కరము కరమున కీలించి కలసి మెలసి
మన్న సహధర్మచారిణి, మధుర మధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, పూర్ణరాగ
కలిత, నా దుఃఖ, మనువులే తొలగిపోవ,
వీడిపోవు నేమో యను వెరపు వలన
నాకు మరణమ్ము వల దనినాను—

# ప్రతీక్ష

నాటి తుది సంజె చీకటి కాటుకల వి
లీన మైపోవు రాజమార్గాన, నీవు
కదలిపోతి, విషాదముఖమ్ము గూర్చి
నగము నిద్దురలో క్రమ్ము స్వప్న మటులు.

ఆపుకోలేని మమత, ఘంటాపథమ్ము
నడుమ పరువిడి, నిలబడినాడ నట్టి,
విచ్చుకొనిపోవు వీక్షణ వితతి తోడ,
మూసికొనిపోవు శూన్య హృ త్పుటము తోడ.

ఆ నిగూఢ ప్రశాంత సంధ్యా దురంత
గర్భకుహ రాంతరమ్ముల కలచిపోవు
క్రమ భవదీయ మంజీర కటక గాన
రవముచే తిమిరమ్ము సాంద్రతర మయ్యె.

ఆ యుగమ్ము తమ స్సాంద్ర యవని కాంత
రంపు టేకాంతమున బడి, యా క్రమక్ర

మాస్త్రమిత నూవు రార వాహ్వానములను
వెంట నంటి, నా హృదయము వెడలిపోయె.

ఆ సరణి, నేను ప్రతి దిన సాయసాయ
సమయమున, నీవు పోయిన చక్కి, చూపు
లొట్టి వరపుచు, శ్రవణాల నొట్టి తెరచు
వెదురు చూతు నీ కొరకు నా యెడద కొరకు.

# ఇదె వచ్చుచున్నాను

ఇదె వచ్చుచున్నాను ప్రియురాలా!
ఇక నిలువలేను నా ప్రియురాలా!

చిరకాల మీ యెడద చెరలో నిమిడి నేడు
పొరలి పొంగెడు దుఃఖ ఝరులపై పరువెత్తి
ఇదె . . . .

ఈ విరహసంతాప మీ ప్రవాసక్లేశ
మే వగిది సహియింతు నెటులు జీవింతుఁ?
ఇదె . . . .



అవలి దరి నీ పిలుపు పవలు రేలును మ్రోయ
మిగుల తొందర మనసు నవసి తపియించుఁ!
ఇదె . . . .

శూన్యలోకము దాటి శుష్కదేహము దాటి
యన్యోన్య నిబిడ నిత్యాశ్లేష కాంక్షతో
ఇదె . . . .

# నిర్యాణము

చల్లగా నున్న దీ సుప్రశాంత వేళ
చల్లగా సాగు నీ సుప్రశాంత పథము
బయలుదేరుము దూరంపు బయనమునకు
వలదు తడయగ, ద వ్వేగవలయు నేడు.

పవన పోల్లాస మధుర గానంబు వలదు
ప్రవిమ లానందచంద్రికల్ పనికిరావు
అల్ల నల్లన గొంతెత్తి యాలపింపు
పరమపద శాంతిపూర్ణ నిర్వాణ గీతి.

ఒక్క టొకటె యదృశ్య మౌ చుక్క లెల్ల
అల్ల నల్ల నాశలుకూడ నంతరించె ;
తిమిరమో దివ్యతేజమో తెలియకుండ
నాకసం బటు వెర గయ్యె లోక మెల్ల.

వెడల లేక వెడల లేక వెడలు చెలికి
వీడ్కొలుపు లిచ్చు జాలిగా విహగకులము

ఆపుకోలేక పొరలు సంతాప మెల్ల
తరళ తుహినాశ్రుధారల తరులు గురియు.

ఎన్నడును లేని రీతి తో తెంచె నేమొ
మెల్లమెల్లన మాంద్యము చల్లదనము
కలిగి నునులేతగాలులు కవికుమార !
ఎచటి కేగుచు నుంటివో యేమొ నేడు !

# ఓ మానవోత్తమా!

ఓ మానవోత్తమా!
ఓ వీరమూర్ధన్య!
ఓ యమృతభానమా
నోన్నతప్రేమసామ్రాజ్యైకచక్రవర్తి!
స్నేహశీలి!

నీ హృదంతరములో నిరుపమా నాఖాత
రత్నాకరామూల్య రాగసంపద మెరయు!
నీ యాశయమ్ములో నిర్మలోత్తుంగ ది
వ్యాకాశ సంకాశ భాగ్యరాసులు మెరయు!

ఈ యశ్రుఝరులతో, ఇరులతో, రొదలతో
సొదలతో, ఈ హాస మృదుల వాసనలతో
విసములతో, సిగ్గుతో, కొసరు తేనియలతో
ఈ పాట బ్రతుకు నీ కేపాటి దోయి, నా
నెచ్చెలీ!
నెచ్చెలీ!

# దారులన్నియు మాపె ...

దారు లన్నియు మాపె దశదిశలు ముంచెత్తె
నీరంధ్ర భయ దాంధకార జీమూతాళి!
ప్రేయసీ, ప్రేయసీ, వెడలిపోయితి వేల
ఆ యగమ్య తమస్వినీ గర్భకుహరాల?

ఆ యఖాతంపు టేకాంతమ్ములో మ్రోసి
మాయమై మెల్లగా నీ యడుగుసందడులు
నా యెడదత్రోవనే వడి నడచిన ట్లయ్యె;
నా యెడదలోననే మాయ మైన ట్లయ్యె!

అంత నా గొంతులో 'హా ప్రియా' యను కేక
అంతంత దివి కేగె, అంతంత దిగి పోయె;
తారలే కను విచ్చి తమములే శ్రుతి విచ్చి
ఆ రవము విని నన్ను గని జాలి నొందాయి.

నాటి నుండియు నేను ప్రతి నిశీథతమంపు
కాటుకల వాయ నారు లే రరయలేని తరి

మూవికొని మూవికొని శూన్యహృదయములోని
'కో వెలీ!' యని క్రుంగి క్రుంగి యేడ్తును సుమా!

నడిలేని నడిరేయి బడిపోయి నట్టె నీ
కడియాల రవళులే విరుగాజు మ్రోతలే
వ్రే లెత్తి మాపు జీవితపథమ్ములు నాకు ;
కే లెత్తి నడిపింపు, నె ల్గెత్తి న న్నిలుపు!

# అపుడు ...

అపుడు గొంతెత్తి యేడ్చినాను ; అపుడు నన్ను
కాంచగా నోపగా లేక కన్ను లద్ది
యార్చికొనినవి తారకలు ; అపుడు మొగిలు
లల్లనల్లన నలనల్లనై ధరమ్ము
లైన నిట్టూర్పుదొంతర లైనవి ; అపుడు
కుంచుకొని కుంచుకొని కుహారాకుహారవాత్రి
నను తొలగి దవ్వు దవ్వులు చని శిరాలు
వాల్చికొనినవి తిమిరాలు భయవశాన ;
అపుడు బ్రతు కొక్కటే యేడు పైన గాలి
రిచ్చవడి వట్టి పసిపాపలీల మౌన
యానమున బారి సుప్తపత్రాళి నొదిగి
హొంచి చూచుచు చలియించి పోయినాడు ;
అప్పు డీ విశ్వమే నిత్యయాత్ర నాగి
శ్రవణములు మూసికొనినది ; రాక రాక
నా గళతమఃపథమ్ముల రేగి రేగి
రోద నొచ్చలి తొచ్చగితా దురంత
దుస్సహోర్చులు వెడలి రాగా....

ఇపుడు ...

ఇపుడు ప్రళయమ్ము క్రమ్మిన దేమొ, కాక
దొరకదో నిల్వ నీడ నా విరుతపాటకు,
ఇంత యిరు కౌనె యిమ్మహానంత విశ్వ
మలమికొను చీకటుల కలకలమువలన!

ఎటు గనిన గాని ఆకాశ హృదయవాటి
సంకుల విషాద జలధర చ్ఛాయ లందు
హొంచు బాష్పాంబునిధులు ఘోషించు; నెగుర
పక్షములు దాల్ప వెరచు నా పాట నేడు!

దశదిశల వీల్చుకొని రేగు దారుణ ప్ర
భంజ నోచ్చలి తోన్మత్త భంగ వీథి
నెగయు, నయ్యయో, లోకేశు నెడద వెడలి
యేడ్పు నందదు లెగయూర్పు లేర్చు పొగలు;
హొంచి హొంచి నాలో మూల మూలలందు,
క్రుంగి క్రుంగి యడంగి దాగుండు గీతి!

స్థాణు వయ్యెనొ, పాషాణ జడభరమ్ము
గనెనొ, కదలదు మెదలదు కంఠరవము;

నే డిదేమో క్షమాజననీ పురాణ
గర్భకుహరమ్ము విదళించి కారువిచ్చు
చిరుపుమంట మూలుం గేదా యదా? క్రొక్కి...
ఇపుడు ప్రళయమే! ........

# ఈ పయనపుం దెరువు

ఈ పయనపుం దెరువు ఇరుదెసల శిర సెత్తు
ప్రతికుజము ప్రతిసుమము ప్రతివిహంగమ రుతము
అంతలో నా హృదయ మందు సంజియకావి
వింతలై నశియించునా, నా బ్రదుకు
మంతేని సహియించునా!

అంతమే లేని నా యాత్రాపథాన నా
పదచిహ్నములు పోలె పడియున్న వెన్నెన్నొ
అడుగుజాడలు మదీ యార్ద్రహృదయమ్ములో
నీ కడుపులో తారలై, నిశ్శబ్ద
వాటిలో విరుపాటలై!

వెను దిరిగి కను విరిసి వీక్షింతునా అంత
ప్రతిపద మ్మమృత జీవప్రతిభ పులకించి
పలుకరించిన క్రొత్త బలముతో చలముతో
పడి నడతు పవలు రేల, అజ్ఞాత
భావికాలపు యుగాల!

# వెదకి వేసారి ...

వెదకి వేసారి నా వెఱ్ఱిబ్రతు కెపుడేని
తుదిరేయి కను మూయునా,
        బేలరై
నిదుర బరువుల క్రుంగునా,
మరపు మనకల దారి తెరచికొని కల యేవొ
విరిసికొని పరతెంచును,
        కారు రా
తిరికొనల మెరపించును.

కలగి తొట్రిలును నాకలి తొందరల సోలు
కరము లట్టే బాతునో,
        నా మందు
కనుల వట్టే తెరతునో,
అంతలో నింతలో నడుగుజాడయె లేక
వింత కల కరగి చనును,
        నాకు నా
వంత కథయే మిగులును.

ఎవరు వేద్వగ లేను, వచ్చి వావగ లేను
కన లేని వెలుగు కొరకై,
ఎన్నడును
కన రాని దాని కొరకై.
ఒక క్రొత్త బరువుతో, ఒక క్రొత్త యానతో
ఒకడనే వడిపోదును,
శూన్యమున
ఒకడనే కృశియింతును.

# ఇది నిశాంత ...

ఇది నిశాంత తమఃక్రాంత మిది దరిద్ర
మీ నిశాంతమ్ము శూన్య, మిం దెన్నడో ర
హ శ్శిథిలసుప్త కలవర మంది లేవి
గుబులుకొను లేత నెత్తావి గుసగుస లివి!

అంత నీ యంధమందిర మందు నొక్క
రెప్పపాటు వేకువ ఒక్క రెప్పపాటి
ఉన్మిషిత జీవ నాగమ నోత్సవమ్ము
ఉదిత గీతా ప్రవేశ ముహూర్త వేళ!

అప్పుడే గృహాన శ్రవాతాయనముల
కొలుకులందు లే వెలుంగు తళుకు జివురు
లరుణ మసృణ తోరణ పంక్తు లల్లు నేమొ
ఆడు నేమొ వాడిన మోము లట్టి వాల్చు!

తెరచికొన్న ద్వారము లొచ్చి విరిసికొన్న
వాకిలిం జేరి, మంగళవాద్యపాళి
గద్గదిక వోవ సవరించి గళము, పాడు
నేమొ నిర్జీవ నిశ్శబ్ద మిట్టి మూగు!

మరల గ్రుడ్డిరాతిరి పడు, మరల నోరు
కాని గ్రుతులేని లేని చీకటులు మరల
మరల పాడిల్లు...

# నా యుగాదులు...

నా యుగాదులు లేవు
నా యుషస్సులు లేవు
నేను హేమంత కృ
ష్ణానంత శర్వరిని.

నాకు కాల మ్మొక్క
టే కారురూపు, నా
శోకమ్మువలెనె, నా
బ్రతుకువలె,
నా వలెనె.

# ప్రేయసీ! ప్రేయసీ!

ప్రేయసీ! ప్రేయసీ! ఓ యమావాస్యా త
మస్వినీ! గగన సీమంతినీ! నా సఖీ!
నీ దీర్ఘ ధమ్మిల్ల నీలవల్లీచ్ఛాయ
పొదివికొని, నిదురవెర విడిచి, పూవులు నేడు
మరుగుహృదయాల నా కొరకు తళతళ పాడు;
సురభి ళాహ్వానముల్ పరపి స న్నలచి దు
ర్భర దురంతావేగపరత వెర్రిని జేయు!
నా సఖీ! నా సఖీ! నే సైపగా లేను!



నీ కైశికధ్వాంత నిశ్శబ్దముం జీల్చి
నా కొరకె, నా కొరకె, నా శర్వరీసతీ!
కోటి నవమల్లికలు కోటి కన్నులు విప్పి
విరహావీక్షణ భయంకర మాధురుల నన్ను
పలుకరించిన, చెలీ, పులకరించిన బ్రతుకు
వేగిపోవునా, యేమొ, ఆగలేనో, యేమొ,
నా సఖీ! నా సఖీ! నే సైపగా లేను!

నీ కుంతలములలో నాకై శిరసు లెత్తి
నను బోల్చుకొన్నవో! నను బిల్చుచున్నవో!
నటియించు ఆ పూవు లెటు నవ్వుచున్నవో!
తురిమి వినరుము వాని ఎరుగ నేరని దూర
దూరాలకో, రహస్తీరాలకో, చెలీ!
కప్పికొందున కనులు! కప్పగలనా యెడద?
నా సఖీ! నా సఖీ! నే సైపగా లేను!

ఓ నితాంత వియోగినీ! ఓ నిశీథి
నీ! కఠోర ప్రణయశాలినీ! క్షమింపు!
చాలు, నా సఖీ, నీ ప్రేమశాప, మీ య
పూర్వ నారకయాత నాఖర్వతాపము!

## వినరా వీ విభావరీ ...

వినరా వీ విభావరీ
వేలా కాలల నీ మృదు
వన వాంచలముల గునగునలో,
        మనలు చరణ మంజీరము
        క్వానరు జాలి పలుకరింతలో!
ఈ కుటీర ముఖద్వార
మిందే వ్రేలాడి వగము
వాడి, విరహా తోరణమ్మునై
        వలవంత వదలి నేల జీ
        రాడి యెన్నినాళ్ళు మనుదునో!

ఇపుడు వత్తువా నీ కొర
కెదురు చూచు నీ వియోగి
యెడద మంచుజడులు కురియును,
        మా పేమో, రే పెటకో
        వెడలి చనునా, నిదుర మునుగునో!
ఆరలేని నా కోరిక
కారుచూవు బొరగ వీలి
కాలి కుములు ఈ చీకటితో

క్రాగి క్రాగి నీ కొరకై
కరవులోననే నశింతునో!

నీ మనోజ్ఞ కాంచన కాం
చీమణి ఘంటా గళములు
ఏకాంతము కరగ మ్రోయగా
విన నరవే బ్రదుకు దాల్చి
యెడద మ్రోత కెంత యోర్తునో!

ఈ వియోగ నిరాశా క్ష
ణ క్షణ ప్రతీక్ష బెదరి
ఎగసి ఎగసి పగిలిపోదునో!
పగ లెరుగని ప్రవాసమున
కిక వేకువ రేకు విరియదో!



ఆకస మాలోకనముగ
లోక మెల్ల వీనుగ కా
లాంతమునకు కాచి యుందునా!
ఆస లేని ఆసకు ప్రా
ణాంత మేని వేచి యుందునా!

విప్పురింపదా చైత్రశుభో
త్సవ విభాతకల్యాణము
ఈ దరిద్రహేమంతమున...

## నా నివాసమ్ము ...

నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధుర సుషమా సుధాగాన మంజువాటి,
ఏ నొక వియోగగీతిక,
నేను నిదుర

వెన్నెలల దారి నొక రేయి వెడలిపోతి
నొక విపంచీ విరహాకంఠ మొరసి యొగసి.

ఏ నొక వియోగశాలినీ హృదయరాగ
వేదనారేఖ, నాకలి వేగు నామె
యంగుళీ కిసలయ వంచ లాంచలముల
విడివడి యనంతవిశ్వాన బడితి నాడు.

అదియె మొద లేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ!

ఆ సమయ మాదిగా సప్వరోంగ నాను
రాగవీథుల, కిన్నరీ రమ్యకంఠ
సీమలో, శ్రావ ణాంబు దాశ్లేషపాళి,

తారకాలోక పంక్తుల, మారు తోరు
పక్షముల, తిరుగాడుదు పవలు రేలు,
కన్ను మోడుపు మెయి వాల్పు గాని లేక!

ఇది ముగియ బోని ఏ యర్థ మెరుగరాని
వెనటి లేని వెర్రి యన్వేషణమ్ము!

ఈ ప్రవాస యాత్రాగతి నిటులె నేను
కదలిపోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పు పోలిక, ఒక్క మౌన
బాష్పకణ మటు, ఒక గాఢవాంఛ పగిది.

## ఏను తొలుత

ఏను తొలుత నే గూడేని లేని పులుగు
రాయడ, వహించినాడ నా బ్రతుకు బాట
నాట నవయని రెక్క యుయ్యాల కొనల
నెరువె లేని, తీరమె లేని దివ్యసీమ!

అంత నే మారిపోతి సంధ్యామనోజ్ఞ
క్షితసిందూరరేఖగా, వేయి వెయిగ,
మెయి మెయిగ, హాయి హాయిగా మెలగినాను
పైడివన్నియతో నీలినీరదతోడ!

నేను మెలమెల్ల రిక్కనైనాను; కాని
ఆ విశాల వినీలసౌధాంతికమున,
ఉండగలవా ప్రవాసినై ఉడుసఖాళి
పలుకరింపక యొక రెప్పపాటు వేళ!

ఇపుడు నే నొక్క తుదిరేయి యిరులబాయ
నెగడికొని విమ్ముకొని నటియించుకొనుచు
అలము వెలుగుల పరువుల కులికి పారి
కుంచుకొని రిచ్చపడి క్రుంగి క్రుంగి యలసి
యిపుడు నే నొక్క తుదిరేయి యిరులబాయ
నై నశించుచున్నాను....

# ఏను మరణించుచున్నాను ...

ఏను మరణించుచున్నాను ; ఇటు నశింతు
నా కొరకు వెమ్మగిల నయనమ్ము లేదు ;
పసిడివేకువ పెండ్లిండ్ల పడిన యెవరు
కరగనేర్తురు జరఠాంధకారమృతికి ?

నా మరణశయ్య పరచుకొన్నాను నేనె!
నేనె నాకు వీడ్కొలుపు విన్పించినాను!
నేనె నాపయి వాలినా, నేనె జాలి
నెదనెద గదించినాను, రోదించినాను!

బ్రతికియున్న మృత్యువునై ప్రవాసతిమిర
నీరవసమాధి క్రుళ్ళి క్రుంగినపు డేని
నిను పిలిచినాన, నా మూల్గునీడ ముసిరి
కుములునేమొ నీ గానోత్సవముల నడుమ?

ఇదియె నా చితి, పేర్చితి. నేనె దీని
వదలిపోని నా యవసానవాంఛ గాగ ;
వడకని కరాలు రగులుచు దుడుకుచిచ్చు
లాలనల నింత నుసిగాగ కాలు త్రుటినె!

అలయు వాతెర యూర్పుగాలులు కదల్చి
రేపు శరతే నా కాష్ఠాల రేగు మంట
మును బ్రతుకునట్లు నా దేహమును దహింపు!
వదలే అర్పుగా నొక బొమ్మ మేని!

ఎవ రోహో, ఈ నిశీథి నెగడి, నీడవోలె నిలిచి
పిలుతు రెవరో, మూగకనులు మోయలేని చూపుల
ఎవ రోహో! ఎవ రోహో!

ఇపుడా నను పలుకరింతురు!
మోయలేని నీరవగళమున చలించు కోరికతో
ఇపుడా నను పలుకరింతురు!

ఎవరని ఈ రేయి నిదుర హృదయ మదర, వేయి
వాయలాడ పెనుచీకటి సైగలతో నా కన్నుల
రక్త మురల లాగికొందురు!

ఎవరో, నా హృదయనాళ మేలా తునియలుగా నా
నిర్జీవపు జీవితమ్ము నిట వదలుదురా!
ఎవ రోహో! ఎవ రోహో!
ఇపుడా నను పలుకరింతురు?

## నా కఠినపాద శిలల క్రింద ...

నా కఠినపాద శిలల క్రింద బడి నలిగి
పోయె నెన్నెన్నియో మల్లెపూలు మున్ను.

ఛీ! శైవాలు మాశిపై దాలిచికొన
ఇంత విరిదోటలో నవు డెంత వెదకి
వేచియున్నానో, విసువని వెర్రి కోర్కె
తొందరల చూపు లటు నిటు తూలినంత
హృదయముల నయనమ్ముల బెదరు కలత
మాసికొనబోని యొక నసముగుద లేదు.

నా కనుల క్రాగు చీకట్లు ప్రాకుచోట
లేదు నెత్తావి, మధువేని లేదు, లేదు
ప్రాణ, మొక్క లావణ్యలవమ్ము లేదు;
ఏను రుజనైతి, జరనైతి, మృత్యువైతి!

ఈ నిశావసానమ్మున, ఏ శుభాని
లమ్ము నిట్టూర్చెనో జాలి రాగ నేడు
వ్రాలె నా పాడు అడుగుల ప్రోల నొక్క

తారయే, యొక్క దివ్యమందార సుమమె!

మోహినీహాస మల్లీ ప్రఫుల్లరుచియొ,
శ్రీలలిత వైజయంతీ పరిమళమ్మొ,
హరజటా పారిజాత లతాంత మధువె,
నిర్దయావిశితమ్ము లీ నీచనఖర
ములకొనరె కోరి పరవశమ్మున చలించె!

ఇటు పడకు కేల దీని స్పృశింపలేను
వెరగు కనురెప్పరేకుల విరియలేను,
ఎటు లదిమికొందు నా మ్రోడుబెడద, ఎటుల
వెరగి వెరసిన బింపిరికురుల తాల్తు!

## ఇది విభాత మహోత్సవమ్ము . . .

ఇది విభాత మహోత్సవ మ్మొమొ ! ఇదియు
నూత్న కళ్యాణతూర్య మనోజ్ఞగాన
నృత్యకోలాహల మ్మొకో ! ఇది సువర్ణ
మంగ ళాక్ష తాశీ ర్వర్ష మగునో, కాదో !

ప్రేయసీ ! సుఖస్వప్న దరిద్ర మైన
బ్రతుకు నాది, నిద్దురవోవు వల్లకాదు :
నమ్ము గోరని బరువునేత్రమ్ము లెటులు
మలిమికొనునో, పాపము, మేలుకొలుపె మరవి !

త్రిజగతీపతి కోటీర దివ్యరత్న
రాజి నేలు వజ్రాలతురాయి వీవు !
ఏనొ పాతాళ లోకంపు టిరుకునందు
లందు దిగబ్రాక వెరచు గాఢాంధ రేఖను !

తారకా పూర్ణచంద్ర మార్తాండబింబ
మండితమ్ము మహాకాశ మంటపమ్ము
నందె కాదె పాణిగ్రహణమ్ము దొరకు ;
పతిత వె ల్లాదు ? నే నెటు వక్షి నాదు?

# ఇన్ని కల్పాలు ...

ఇన్ని కల్పాలు కాలు నా యెద నడంగి
నాకు ప్రాణమె యగు వేదనాసుఖమ్ము
ఇదె పలుకరింతు, నా సఖీ ఇపుడు నీ య
పూర్వ కరుణార్ద్ర నీరవ మూర్తి యగుచు,
నే కురియలేని మూగకన్నీరు యుగయు
గాల నేత్రాల యశ్రువర్షాలు, కడుగ,
చల్లగా జాలిజాలిగా శాంతమధుర
ముగ నుషఃకాలకౌముదిసొగసు వైతి!

నీవు తొలిప్రొద్దు నునుమంచు తీవసోనవు
నీవు వర్షాశరత్తుల నిబిడసంగ
మమున బొడమిన సంధ్యాకుమారి, నీవు
తిమిరనిశ్వాసముల మాసి కుములు శర్వ
రీ వియోగకపోలపాళికవు, నీవె,
నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు, విశ్వ
వేద నామూల్య భాగ్య మీవే, నిజమ్ము
నే గళమ్మార పాడుకొనిన యఖాత
శోకగీతమ్ములం దీవె శోకగీతివి!
ఊర్వశీ! ప్రేయసీ!

## నాడు 'శాఫో' ...

నాడు 'శాఫో' విరహాకంఠనాళ వేణు
నాలపించిన యరుణారుణాంధగీతి
యేడ్పు, నిట్టూర్పు, కోపించు నిపుడు సంధ్య
యటుల, కాల విశాల విహాయసమున!

ప్రేయసీ! 'వీని కృపణజీవితగళమ్ము
ఎండ వానల విచికిపోయినది, జీర
వారునో, మూగవోవునో, వడకి వెలితి
యౌనో, పాడదో' యను సందియమ్ము వలదు.

నాటి యమునసకన్నీటిపాట యేనె
యేడ్చినది, మింటిమూవుల కెగసి మాపి,
క్రుంగి యజ్ఞాత పాతాళకుహరములకు,
వరచు నిశ్వసించుచు భావిపథము లంటి!

ఊర్వశీ! ప్రేయసీ! నేడా, యుష్మదీయ
చరణ కరుణా మధుకణమ్మె దొరకు నేమొ,
మూడులోకాలసుఖ మొక్కముడి నిమిడ్చి
వినరలేనా కాలాంతమే వెనుకప్రాక!

ఊర్వశీ! ప్రేయసీ! నేడా, యుష్మదీయ
చరణ మసృ ణారు ణోదయ సురభికాంతి
పలుకరింపమన, పోకుమా, తళుకు మసున,
ఆరని వెలుంగె నా గీతికాంతికముల
చేర్చికొని, కూర్చికొని, భవ చ్ఛ్రీవిలాస
హాస వాసనా లేశము అందికొనగ
రమ్య హిమవాలు కావ్య నీరాజనముగ
ఈయనా, నా సఖీ!...

కాలమే ...

కాలమే పసిపాప కనువిచ్చిన యుషస్సు
కలగా కలవరించి వెలుగుగా పులకించి
ఇరుల కడు పొరని నే తెరచి వాలిన నాడె
మిసిమి వన్నెల మేన మసి జాలిగా నయ్యె..
తొలి వియోగిని నేనె!
తొలి ప్రేయసిని నేనె!
ఆ నాటి కీ నాటి కేను నీ దానవే!

మున్నీటి తరగలకు మిన్నేటి నురుగులకు
తడయు నెడబా టేనె! విడని కౌగిలి నేనె!
వానచినుకుగ పొగసి వలపుమావుగ నెగసి
వడిపోవుదును నేనె! పరువులిడుదును నేనె!
తొలి వియోగిని నేనె!
తొలి ప్రేయసిని నేనె!
ఆ నాటి కీ నాటి కేను నీ దానవే!

హాలాహ లానలమె అమృత శీతల రసమె
తోడబుట్టులు నాకు! తోడునీడలు నాకు!

నీ నీలి పెదవిపై నిట్టూర్పుగా ప్రాకి
తొలిప్రొద్దు చెరగులో పలుకరింతగ సోకి....
తొలి వియోగిని నేనె!
తొలి ప్రేయసిని నేనె!
ఆ నాటి కీ నాటి కేను నీ దాననే!

వేయివేలుయుగాలు రేయిలై, పవలులై
అదరి కురిసిన యేడ్పు అలరి విరిసిన నవ్వు
బరువుకానుకగ, మన భాగ్యబంధమ్ముగా
చేర్చికొని నాలోన కూర్చితిని నీకొరకె!
తొలి వియోగిని నేనె!
తొలి ప్రేయసిని నేనె!
ఆ నాటి కీ నాటి కేను నీ దాననే!

కలకాల మలయుకే నిలువునా తెరచుకొని
ఎదు రరయు నీ వలపుటింటి ప్రాంగణములో
తొలి ప్రేయసిని నేనె!
తొలి వియోగిని నేనె!
ఆ నాటి కీ నాటి కేను నీ దాననే!

## మసమబ్బు …

మసమబ్బు లేదున్క కొనలపై సోన లా
నెలవంక విరునవ్వు వెలువపాట,
తొలిప్రొద్దు పొడుపురేకుల పైడిదారుల
ఏరు లా మంచుకన్నీరుపాట,
పావురా యుయ్యాల పక్షాల యంచుల
జాలు లా గాలి నీలాలపాట,
విరజాజికన్నె నిదురకన్ను రెప్పల
కాల్వ లో నెత్తావి కలలపాట,

కలిసి, నీ గొంతుత్రోవల సెలలు గట్టి,
అలల నుప్పొంగి, నా హృదయాంచలముల
పారి, దాహాన బీటలువారి యెండు
ఈ బ్రతుకునిండ నిండిపోయినవి, చెలియ.

ఒకపరి తీయ నా బరువు
లోత్తగ జీవిత మంత క్రుంగి, వే
రొకపరి తేలి యేలా యెటకో
యెటకో జలదాల దాటి తా

రకల విశాల నీలపథ
   రాజాల నెల్ల నతిక్రమించి పో
యి కలియు పోలిపోలి చదలేటి
   తుషారపు స్వప్నరాసులన్.

ఈవు తేనియగాం తెత్తితేని. నీ క
పోలములు చిరునవ్వునేత్రాలు కూడ
మరచి సర్వమ్ము, పొగసుగా శిరసు త్రిప్పి
వెందులకొ పాడి నట్లుండు నేదొ యేదొ!

మరియు నేవేవొ కలలు ముంగురుల జారి,
వాలి కనుబొమ్మ నునుగొమ్మ వంపు లందు,
దూరి చూపుల, చెక్కిళ్ళ చేరి, మంద
మందహాసంపు మనకలో మాయ మౌను!

## ఆమె కన్నులలో ...

ఆమె కన్నులలో వనం తాంబరంపు
నీలినీడలు కలవు:
వినిర్మలాంబు
పూర గంభీర శాంత కాసార చిత్ర
హృదయములలోని గాటంపు నిదురవాయ
లందు నెడనెడ గ్రమ్మె:
సంధ్యావసాన
సమయమున నీపపాదప శాఖి కాగ్ర
వ్రాత కుటిల మార్గముల లోపల వసించు
ఇరుల గుసగుసల్ వానిలో నిపుడు నపుడు
వినబడుచు నుండు:
మరికొన్ని వేళ లందు
వానకారు మబ్బుల మెయివన్నె వెనుక
దాగు బొప్పమ్ము లామె నేత్రముల లోన
హెంచుచుండును;
ఎదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుగాని అర్థమ్ము కాని
రావగీతమ్ము లవి.

# ఎదలోపలి ఎదలో ...

ఎదలోపలి యెదలో, నె
మ్మదిలో, జీవిత రహస్యమార్గమ్ములలో
వదలని కోరిక వై, నా
బ్రదుకుబరువు లెల్ల పాట పాడింతు సఖీ!

వలువపసౌళిగాలి
నునుచక్కిలిగింతల కౌగిలింతలన్
నిలుపున పాటగా
కరగనేర్చునా నీరవ వేణువీథి! నీ
వలపుతలంపు సోకినవె,
ప్రాణసఖీ! బ్రతు కెల్ల కోటి గొం
తుల విడి సోనలై పారలు
నూతన గీత సుధాపథాలలో!

నీ యాజ్ఞ కూడెనా, గొంతుముడి వీడెనా
హాయిగా యుగయుగంబుల కలల్ పాడనా!
విరగాథసాంద్ర మేల్కొలిపి సందేశాల
వరపనా దిక్కుదిక్కులకు మక్కులకు!

# ఆ యనాథ బాలిక ...

ఆ యనాథ బాలిక ప్రియురాలు నాకు!

ఆమె నవసాంధ్య సమయ మల్లీ మనోజ్ఞ
కుసుమకామిని: ఏదో వింతకోర్కె తీయ
దనపు వేదన నా జీవితమున రేపు!

ఆమె స్వప్నాలు కను నెప్పు; డామె మేని
తలిరులావణ్య మొక్క నేత్రముగ విరిసి
వెరగుమాపుల తనుదానె యరసికొనును!

ఆమె సొగసు రేకులు విచ్చి యమృతమధువు
నటన వాసింపబోదు, గానమ్ము సేయదు;
ఆమె ప్రాయంపు వాకిళు లందు వలపు
తడబడి యడంగు సిగ్గుదొంతరల తెరల!

# తమి బిగిసిపోవు ...

తమి బిగిసిపోవు నొక్క సంధ్యావసాన
సాంద్ర కాశ్మీర దృఢపరిష్వంగ మందు
నిమిడి, నిలు వెల్ల ఒదిగి శోషిలిన యామె
నేను తొలిసారి కాంచి కంపిలితి నాడు.

కార్మొయిలు పెదవుల ఖండఖండములుగ
బిదికిపోయిన కౌముదీ మృదులకళిక
కాంచి యొకరేయి దుస్సహా గాఢ దుఃఖ
మాపుకో లేక యేడ్చె నా యార్ద్ర మనము!

క్రొత్తరాక నాడలె యెరిగికొనని గాలి
తమకవుం గౌగిలింత తొందరల నలగి
యూపి రాడక మూర్ఛిలు నొక్క యలరు
గని వనట క్రుంగినా నొక్కదినము దినము.

వాడిపోయిన ప్రతి సౌరభమ్ము కొరకు
కనుమొరంగిన ప్రతి హిమకణము కొరకు
బ్రతుకు బ్రతు కెల్ల కరగు బాష్పములు కాగ.
ఎట్లు కననేర్తు నా నాటి దృశ్య మేను?

హార్వ !

వారి తల లెత్తు నింత సౌందర్యలవము
వదలిపోలేరు చంపెడువరకు వీరు !
మృదుల కరుణా మధురము నా హృదయ, మెవ్వ
రెరుగజాలుదు రే మని యెత్తు నెపుడు!

# తుది మొదలు ...

తుది మొదలు లేని దా నాటి తొలి నిశీథ
వుం దమము;
అఖాత మయ్యది;
అందు దారి
లేదు; మిణుగురేనియు కానరాదు;
ఒకండ
హెంచి యొదిగితి నే మూల మూల లందు.

నాటి నిశీథ నీల గగనమ్ముమయిం
గనుమోడ్పు మేఘవుం
గాటుక కౌగిలింతల పెనంగి
సుకమ్ముగ నిద్రవోవు నీ
వేటికొ యొత్తిగిల్లి, తరళేక్షణ!
నూత్న వియోగ శోకవుం
జాటున స్రుక్కు, దీను కనినా
వనురాగము మోసు లెత్తగాన్.

నీ కనుమూపువీకటుల నీడల
 నా యెద నిల్వలేదు, పే
రాకలి గొన్న నా బ్రతుకునందు
 త్వదీయ మనోజ్ఞ హాసరే
ఖా కమనీయ కాంతిసుధ
 కాల్వలు కట్టగలేదు, కాని యే
మో కలగున్ మనమ్ము
 వలపుం దమకమ్మున నిన్ దలంచినన్!

నవని త్వదీయహా కరమ్ముకౌళము
 వీణియమీద మూగయై
యవశత వాలెనో!
 అనలమై దహియించు విషాదబాధ డి
ల్లి వడెనో నీ మనోజ్ఞ మధురమ్మగు కంఠము,
 కారువిచ్చు వే
నవి గళ మెత్తి పాడుటకు
 వాలని సోనవిధాన ప్రేయసీ!

# నవ నవ వసంత ...

నవ నవ వసంతచరణముల నాట్యమ్ములా
భవ దమృత లావణ్య వసన విలసనములా
మెరపులై పిలుపులై
మెరపినవి! పలికినవి!

దిశల బడి పరువు లిడు శిశిరంపు టడుగులో!
తుది వీడుకోలుపులో ముదుసలి నిరాశలో!
నీడలై జాడలై
వెరచినవి! పరచినవి!

నా బ్రతుకు నేడు నందన చైత్రవన మౌనా!
ప్రాభాతగగన పూర్వప్రాంగణ మ్మౌనా!
చెర దొలగు జీవమో!
మరపు విడు తేజమో!

నడక నెరుగని తేనె, ఎరక యెగురని తావి,
కయిసేసుకో లేక కలతపడు సోయగము,
పాటలై పక్షులై
ఆశలై హాయులై

దెనదెనల మీరునో
దివ్యపద మంటునో!

కదలు వేకువకనుల నిదుర చెదరెడు వేళ,
మాయు ప్రతితారకయు మబ్బుకల యా వేళ,
అలము స్వప్నము లొక్క వెలుగు రూ పౌ వేళ,
వేంతివి నా జీర్ణజీవిత ప్రాంగణద్వార మా వేళ ...
ఓ వసంతవిలాస మాధుర్యమా!
ఓ యుషఃకల్యాణ లావణ్యమా!

నేడు నా జీవితముకూడ నిర్ఝరాంగ
నా దరస్మిత మయి ప్రపంచాలు ప్రాకు!
పిలుచు నీరేడులోకాల ప్రేమకొరకు!
పరచు నా హృదయము చరాచరములకును!

# ఈ నవా బ్దాగమమ్ముతో ...

ఈ నవా బ్దాగమమ్ముతో ఈ కిశోర
మధుర కలకంఠమునకు హేమంత మెడలి
గొంతువెర వీడెనేని, హృదంతరమున
దాగి యొదిగిన ప్రేమగీతాల రుచుల
నొక్క టొకటి నీకయి విప్పచుండు సకియ!

విరిసికొనిపోవుచున్నవి వీని యమృత
గళ రవమ్మున కపుడె పక్షములు చెలియ!
ఎగసికొనిపోవు వారు లెవ్వ రెగురలేని
స్వప్నసీమల కూహాప్రపంచములకు!

నీ వొకర్తుక వానిపై నిదుర గొమ్మ;
చల్లగా పోదు వెచటి కెచ్చటికొ గాని;
ఇపు డపుడు నీవు మేల్కాంతువేని, వీని
పాటరెక్కలరొద వినంబడును నీకు;
అంత జల్లను నీ బ్రతు కంత; మరల
ఒత్తిగిలి హాయి గన్ను మూయుదువు నీవు!

నాకుమాత్రము గాన మున్నంతవరకు
వాలుబాలు నీ ప్రణయవిశ్వాస మొకటె,
మోసికొందునా నా గీతములను నిన్ను !
మూగవోదునా రాయిదైపోయి విరము !

నా హృదయమందు విశ్వవీణాగళమ్ము
ఘోరు ఘోరున నీ నాదు మ్రోతవెట్టు;

దశదిశాతంత్రు లొక్క సుధాశ్రుతిని బె
వంగి చుక్కలమెట్లపై వంగి వంగి
నిలిచి నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు.

వెలుగులో యమృతాలో తావులో మ రేవొ
కురియు జడులు జడులు గాగ, పారలి పారు
కాలువలు గాగ, పూర్ణకల్లోలములుగ;
కలదు నాలోన క్షీరసాగరము నేడు!

దారి దొరకని నా గళద్వారసీమ
తరగహస్తాల పిలుపుతొందర విదల్చు!
మోయలే నింక లోకాలతీయదనము!
ఆలపింతు నానందతేజోంబునిధుల!

ప్రేయసి! చలియింపని నీ
వేయి వేయి కీలింపుము

చలియించెడు నా కంఠము
నిలిచి నిలిచి పాడగా!

ఊర్వశీ! ఊర్వశీ! నాతో
ఊహావర్ణాంచలముల
వెర పెరుగని కను మూయుము!
తిరుగరాని దారకటోని
శీతాచల శిఖ రోజ్జ్వల
హిమపీఠాగ్రమున కెగసి
శిరము లెత్తి కరము లెత్తి
కురియింతమొ వినిపింతమొ,
మేలుకొనిన ఋతు, లవంత
కాలమె వికసించి వినగ,
గంగా పవిత్రకాంతుల!
యమునా శీతలమధువుల!

కలువపూ బ్రతుకులో కనుమోడ్పు వెన్నెలే
కాలానలం బైన గతి యేమి!
నిరుపేద రెల్లులో నిదురించు సెలయేరె
కల్లోలమే యైన గతి యేమి!

చలువతెమ్మెరజాణ చలవిత్తుడే కాని
మాలతీలతిక కీ మమతకౌగిలి యేలా?
ఆగడమ్మే కాని మూగవేణువుగొంతు
మ్రోగునో హృదయమ్ము రాగిల్లు వరకేని!

నిదురలో స్వప్నాల కదలికే బరు వైన
కల లెల్ల కను విచ్చి కాల్చు నా గతి యేమి?
బ్రతుకులో భావాల పరిమళమె బరు వైన
భావాలె పరువమై బ్రతుకు నా గతి యేమి?

విపురాకు తెరలనే విన్నవోవును కాదె,
విరజాజిమొగ్గనే విరియు మంటా రేమొ!
చదలేటి నీలాల ఝరులలో తారయా?
నటియించ నేర్చునా? నవయించ నోర్చునా?

## ఈ నడికి రేయి...

ఈ నడికిరేయి వెన్నెలయెద చలించు
పిలు పెదో 'నా సఖా' యని వేగిరించు ;
అనలమై కాల్చు నిశ్శబ్దమునె; కలంచి
వరువ లెత్తించు కడల నా బ్రతుకు నిపుడు !

ఎన్ని మారులు సవరించుకొన్న చూపు
తొలగ వేమో యలము నేమొ నెల మొగాన
వెదరునే బెదరి బెదరి బెలియకురులు
జాలిగా నీలమేఘ నిశ్వాసము లటు !

నా కొరకె చాచు నఖికంఠనాళమందు
మ్రోగక చలించి చెరవడ్డ మూగబాధ
ఎటు పిలుచు నన్ను ఆ చూపుటిరుల ; కనులె
పలుక నేరక విడి విడి వగులు నేమొ !

అయ్యయో! ఊర్వశీ విషా దార్ద్రమూర్తి
ఈ నిశీథాన, నా హృదయాన, నిండె,
పూర్ణిమా శుభ్రయామిని భాగ్యవోలె
ఈ యెడదవోలె కాలిపోయినది నేడు.

ప్రాణసఖీ! నీ సుదూర తల్పమున నుప్తి
కట కలలు రావు, కలుగదు కలవరింత,
వేగిపో దిట నీ కయి వేలు రేలు
బ్రతుకు బ్రతు కెల్ల ఒక్క నేత్రముగ కాచి!

మఘవ మస్తక మకుట మాణిక్య రాజి! నీ
వెలుగు మా పాక రేయి వికసించి వాసించి
మిలమిలా తళతళా మెరసినది కురిసినది
పాతాళ భువనాంత పరిసర తమస్సులకు!

హాలాహ లాంధకా రానల జ్వాల రై
కను మూయనే లేని కాలి పోనే లేని
ఈ నిరాశావేదనా నగ్నజీవిపై
నిలిచినది, పులకలై పులకలై పూచినది!

కరుణచే వలపుచే తరళ మైనా వీవు
బిడియాన నిరులలో బడి యేడ్చినా నేము;
ఓరగా ఓరగా నొరుగు నింద్రుని శిరసు
విడిపోయి దిగిపోయి పడినావు నా మ్రోల!

వైకుంఠ మృదుకంఠ వైజయంతీమాల
తెగ నేమొ దిగబారు జగము లన్నీ దాటి!
సురభి సౌదామినిగ తరళ మధు ధారగా
ఈశ్వ రాలోకమే యిటు వెడలెనో నేడు!

మూతపడనే లేని ముక్కోటి దేవతల
కనుతారకలు కోరకములై సుమము లయ్యె;
ఓసరిలి యొండారుల నొరసికొని విరుగబడి
దిశ అంట చీకటులు నిశయే దివస మయ్యె!

ఆకాశ సికతాళి నడగి ప్రాకు స్రవంతి
మూడు లోకాలలో మ్రోయు పుణ్య మ్మయ్యె!
నరకలోకపు టింట స్రవయు శోకతమస్సు
వెలుగు నమృత మ్మయ్యె! వీని భాగ్య మ్మయ్యె!

మఘవ మస్తక మకుట మాణిక్య రాశిలో
మరుగు హృదయమ్ములో మందు జీవితములో
మాత్ర మా సమయాన మనకగా మనకగా
మొయిలు కాటుకనీడ ముసురుకొనెనో ....

పాపము!

## కలుగునా ...

కలుగునా నాకు నీ వియోగమ్ము సకియ ?

వాలు నీ కనురెప్పల జాలిచూపు
అల్ల దిగజారి దిగజారి, అమరనాథ
కంఠమాలా సుమదళాలు గాగ, గగన
వాహినీ నీర జాళినీ పక్ష, నీల
నాట్యములుగ, తారా తోరణములు గాగ,
నింగి నీడల మెట్లుగా, నీలి మొయిలు
జిలుగువిరువులుగా, పులుగులుగ, నలరు
లుగ, నలలుగా, కలలు గాగ, సొగయబోని
వినివికోని వింతవలపు వేడి వేడి
తొందరల పరువుల నెంత తూలి తూలి,
ఎంత దిగజారి దిగజారి, ఎంత వెదకి
వెదకి పడినవో, పెంధూళి కదల లేక
వెలుగు లేక యెగుర లేని మీని కనులె
శిలలు గాక ; వదలని కౌగిలి పెనంగ
బెదరు గాక లజ్జా గాఢ వేద నాగ్ని !

వదలునా యెంట నెదు రేగి వెదకు వలపు !
కలుగునా నాకు నీ వియోగమ్ము, సకియ !

# ఏను నిద్దురవోదునో ...

ఏను నిద్దుర వోదునో యేమొ, కరుణ
సెలవు గైకొన కేగగా వలదు ; ఇన్ని
నాళ్ళ యెడలేని యెడబాటు నా నిరీక్ష
ణమ్ము బరువులు బరువులై నయనయుగళ
మఱెయ్యి, దిగలాగు నిద్దురమరపులకును.

ప్రియతమా, ఇక నిదురింతు పిలువబోక,
బాసిపోకు నిర్భాగ్యపు బ్రదుకు దాటి!
ప్రియతమా, పొరలి పొరలి మొయిన లేవా
మేలుకొననీవు రెప్పల వాలి యదిమి!

ఎటు లెగసి యెగసిపడుదు! ఎటులు వేల
కేల నిన్నంటి యదిమికో తూలిపోదు!
అబ్బ! నా బ్రతుకంత నీ యడుగుదోయి
నావ, ప్రియతమ శృంఖలమ్మె పెనంగ,
దిక్కుమాలిన యెడద బంధింపలేను!

ఊర్వ !

ప్రియతమా, నిను వదలికోలేను, నిదుర
కదలియై కాటుకై కనుగవ నడంచు!
ప్రియతమా, వీడిపోకోయి, వీడలేని
నా మమతవిప్పు కునుకునా నన్నుబోలి!

# కలగు సుషుప్తి ...

కలగు సుషుప్తి నొత్తిగిలగా
పడి లేచు ప్రభాతకాల శ్రీ
తల హృదయంపు టూరుపులు తాక,
నిశా నిట లాంతసీమ శ్యా
మల లలి తాల పాలకలు
మందముగా నటియింప, రాలెనో
యలసెనొ స్వప్న మొం డవశయై
పడె నా కనురెప్ప సెజ్జలన్.

నిన్న రాతిరి వికురంపు నీలికొనల
జారిపడిన స్వప్నమ్ము నిజమ్మొ, యేమొ!
కోమ లామోద కౌముదీ కోరకమ్మొ!
సుర విలాసవతీ ప్రేమచుంబనమ్మొ!

నిదురపొదిగిళ్ళ మెయి మెయి నొదిగి యొదిగి
వెడలినా మంట నందనవీథు లంట,
ఎరుగరాని దెదో కోర్కెబరువు వలన
తడబడి పెనంగు సోమరినడలు నడల!

అపుడు కావలి మొగసాల నా వనాన
వాకుమారుల హెచ్చరికలును లేవు;
అలరు టంతఃపురాలలో వలపు లెడద
నెగయబోదు నిడుదయూర్పు సెగయు కూడ.

మందాకినీ మందమంద గీతానంద
మధు మాధురీ శీత లహరీ పరిష్వంగ
మందు పులకించి, పుష్పించి, జీవించి యా
నంద నారామ మా వేళ నిదురించు.

రాసులుగాగ నేలపయి రాలుచు
పూవుల దూదిదారులే
వేసి నిశా సమీరణము వీలుచు
తావుల పారు నేరులే
పోసి, సుకమ్ముగా నిదురవోవు
లతా లలితాంగి నోర్తుకం
డాసితి నంత; ప్రేయసియు
నా కయి గైకొనె నంత అగగాన్!

ఎదురుగా నిల్చి యెద నెద నదుము కొనెనొ,
కనులు కన్నుల కౌగిలి కరగ గనెనొ,
రెప్పపాటు తెర యయి నా హృదయపుటము
తెరచి నిలిచిన దొక బాష్ప తరళ కణము!

మాయు నిశీథి కుబ్జేఖల మాదిరి
ప్రాకు వనీ మహీజవుం
జాయల కోమల ప్రణయ చంచలయౌ
ప్రతతీ నతీ గతిన్
ప్రేయసి వాలి, నిండు తెలివెన్నెల
వన్నెల మల్లెపూవులన్
దోయిలి నింపి, నా చరణధూళుల
నొదల నుంచి జాలిగాన్ -

"ప్రియతమా, దాసి యక్షయ ప్రేమసేవ
కీ లతాంతాల ముత్తాలు చాలు నోయి?
నింగి మూలలకె నీలి పందిళ్ళు పరచి
యెంత తెలిమల్లెతోట వేయించినావా!"

అడుగుల నడంగి జీవిక నరయ లేక
పిలుచు సెలయేటి నిస్పృహ హాహాచ్ఛలిత కంఠ
కరుణ మాలింపగా లేక కరగ లేక
యచల పాషాణ హృదయ మే మౌనా, నైన?

కోరిక లెల్ల ధూళి పడ
కోల్పడి దిక్కుల శూన్యదృక్కులం
జీరి, యెటో వృథా శిశిర
జీవితభారము బుచ్చుచున్న భూ

నీరుహా మేను: నా మొరడు మేన
నవ ప్రసవాల జాలులే,
ధారలు ధారలై పదము
దాక హిమాంబు తరంగ పొంగులే!

కమల వికసింతునేగదా గగన మలమి
వెలియ నాటిన తోటలో నలరు లేమొ!
కాక నా పాదముల మస్తకమ్ము తోడ
పూజకై పారబోసిన పూవు లేమొ!

విడని వాసన పదములు విరులె యయ్యె:
ఆననమ్మున నశ్రులే యూర వయ్యె:
నిలిచినాడ నేటికి కూడ తొలి వసంత
కాలపు ప్రభాత తరుణ వృక్షమ్ము కరణి!

## నా వలెనె ...

నా వలెనె యాత డున్మత్త భావశాలి,
ఆగికోలేడు రేగు నూహాల నొకింత!
ఎట్టి నిశనే నదరిపోవు నెగసిపడును!
ఎన్ని చుక్కలపాటు లెన్నెన్ని మెరపులు!

ఇంత విరుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవనృత్య మాడుకొనును;
మస్తక మ్మొరగా వంచి మన్ను మిన్ను
వేయికే లాడగా వ్రాసివేసికొనును!

ఏ నెరుంగుదు నా వలెనే యతండు
పాటపదముల కై నిత్యపథికు డయ్యె!
ఏ నెరుంగుదు నా వలెనే యతండు
ప్రతి పదమ్మున శీతల స్వాదు మధు తు
షారముల పార్శ్వముల విరజల్లు వేగ!

## ఈ మిడిసిపాటు ...

ఈ మిడిసిపాటు నీ ప్రేమాల నేల తేవె
శ్రుతు విను కేని లేని యీ పాట కిపుడు?
ఇంత విప్పు రివ్వి యంత హేమంత శృంఖ
లాల బంధింతు మూగతనాల గొంతు!

స్వామి! నూత్న వసంతజీవ ప్రవాః
పల్లవమ్ముల రుమలె నా బ్రతుకుజీర
క్రోసి తీయదనమ్ములు వోసి నవుడె
వెవలివడలేద! యొక యడు గిడగలేద!

మూడులోకాల బరువుల మ్రోత నడగి
యడగి విదికెను గద అంధజడము తాను!
ఓయి గాయకసార్వభౌమా! యి వేటి
తగని త్రుళ్ళింత వెలితిన్పత్యమ్ము లోయి!

# అవధరింతువు ...

అవధరింతువు ప్రతి దివస సాంతమందు
నిత్యనూతన తాండవనృత్య కేళి.
ఓయి నటరాజ, తల లైన నూవ లేక
భువనములు దుర్భ రానందమున నడంగ.
అవ్వి దూహాంచలమ్ముల నతిశయించి
హారలు నమృతరవంపు మాధురులలోన
కొట్టుకొని పోవు, స్వామి, నా క్షుద్రజీవి
తమ్ముగూడ దారియె లేక తనివి వోక!
అంత నే వెర్రి నైపోదు నయ్య; నిన్ను
బోలి పాడబోవుదు: నిన్ను బోలి నాట్య
మాడబోవుదు, లజ్జ బోనాడి; కాక
యింత దాహమ్ము దహియింప నెటులు మనుదు?
ఏ విధాన సౌందర్యర సైకజీవి
నిలువ నేరుతు నిట వొక్క నిముసమేని
మామకీన జీవిత శుష్కమార్గముల త్వ
దీయ పాదమంజీరముల్ మ్రోయకున్న!
ఆటతో పాటతో నేర్పినట్లు దేవ,
ఏనుకూడ నీ వలె నటియింప నిమ్ము
ఎడతెగనియాత్ర నెట్లో సాగించువరకు!
ఎట్లో నీ దర్శనమ్ము సాధించువరకు!

# ప్రథమపాద సూచి

## కృష్ణపక్షము - ప్రవాసము - ఊర్వశి

ప్రథమపాద సూచి